# ఉతుకులో ఎంతో జాగ్రత్త...
# అది సన్‌లైట్ సున్నితమైన తీరు.




[illegible]మైన సన్‌లైట్, మీ బట్టల్ని ఎంతో సున్నితమైన తీరులో ఉతుకుతుంది... అది కూడా మీ చేతులకు హాని కలిగించకుండా. సన్‌లైట్‌తో మీ తెల్ల బట్టలూ, రంగు బట్టలూ మరింత కాంతివంతంగా, మీరు గర్వించేలా తయారౌతాయి.

**బట్టలెంతో సురక్షితం,**
**సన్‌లైట్ ఉతుకులోని అద్భుతం.**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS S

స్థాపకుడు
వి.వి.రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 21 | డిసెంబర్ 83 | సంచిక 11

# ఈ వరస...

| | | |
|---|---|---|
| మొగ్గలో ముల్లు | 8 | 'శంఠిల' |
| భూతం | 17 | ద్వి భాష్యం రాజేశ్వరరావు |
| హ్యూమరాలజీ-11 | 26 | యర్రంశెట్టిశాయి |
| అసలుసంగతి(గల్పిక) | 44 | సదానందశారద |
| అరణ్యం(మినీ) | 47 | వేమకోటి సీతారామశాస్త్రి |
| ప్రణయవీచికలు (సీరియల్) | 49 | వాసిరెడ్డిసీతాదేవి |
| షోకేసులో బొమ్మ | 64 | కల్యాణీదేవి |
| కల్లోలగౌతమి (సీరియల్) | 78 | లల్లాదేవి |
| మరో ప్రపంచపు ఉషోదయం | 90 | ఆర్.ఎస్.కె మూర్తి |
| ఆ అనుభవం కావాలి (సీరియల్) | 103 | వి.మోహన్‌కుమార్ |
| భ్రమణం | 115 | కాలెపు శివశేఖర్ |

ఈ నెల నవలానుబంధం

## మధ్యతరగతి మందహాసం

పి. సత్యవతి

జ్యోతి.భాగ్యలక్ష్మి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన నవల

జ్యోతి. పి.బి.నెం.1824, హైదరాబాద్-20

ముఖచిత్రం ; ర్యాధ

సంపాదకులకు,

పరరట్నాల సమస్యపై యర్రంశెట్టి శాయి హ్యూమరాలజీ మీద మణి (బొంబాయి) గారి ఉత్తరం చదివి నాకు నవ్వాలో ఏడవాలో తెలీడంలేదు. ఆడవాళ్ళు వ్యంగ్య, హాస్యరచనలు చేయడంలోనే కాదు వాటిని అర్థం చేసుకోవడంలో కూడా ఎంతో వెనుకబడి పోయారన్న విషయం ఈ ఉత్తరంద్వారా తెలుస్తోంది అలాంటి స్త్రీలకు నా సానుభూతి!

సి. భవానీశంకర్, ఏ గారు.

అర్యా,

అప్పటి కాంగ్రెసు కొన్నేళ్ళ క్రితం (అప్పుడు ఒక్కటంటే ఒకే ఒక కాంగ్రెస్ వుండేది) ప్రెసిడెంట్ గారొకాయన అన్నారు కదా "హుష్" అవినీతి గురించి మాట్లాడకండి. విదేశీయులు ఈదేశంలో అవినీతి వుందనుకోగలరు "అని శ్రీ(మతి) మణి బొంబాయి గారంటున్నారు కదా... "కిరసనాయిల్ ఉచితం చదివి ఈదేశం అల్లుళ్ళూ, మాంగార్లూ, అత్తగార్లూ హఠాత్తుగా పోయి పెళ్ళి కూతుర్లని తగలబెట్టే ప్రెమాదం వుందీ. జ్యోతి పరువు ఈ దెబ్బతో దిగజారిందీ" అని.

హ్యూమరసం అందించగానే సరిపోదు. పుచ్చుకోవడం కూ డా చేతనవ్వాలి. మనకుండే హాస్యరచయితలే తక్కువ. వారిలో చాలా మంది మెట్లెక్కి చిత్రసీమను చేరుకుంటే, మిగిలిన వారికలాలు కుంభకర్ణ నిద్రలో వున్నాయి. నాటికీ




నేటికీ నిరంతర హ్యూమరసం సరఫరాను కొనసాగిస్తున్నది సాయి గారొక్కరే. దయచేసి ఈ ప్రవాహాన్ని ఆపకండి.

ఏ. కామేశ్వరరావు, విద్యానగర్—13.

పండక్కి పాఠకులకో బహుమానం అంటూ మీరు చేసిన ప్రకటన చూసాక ఎంతో ఆనందం కలిగింది. పాఠకులకు కాలక్షేపంకోసం కాకుండా చదివాక ఆలోచింపచేసే విధంగా సీరియల్స్ రాయడంలో "యండమూరి" పరమదిట్ట ఆయన కలం నుంచి త్వరలో చిందబోయే సీరియల్ కోసరం ఎదురు చూస్తున్నాం! 19,23వ పేజీలలోనీ కార్టూన్లు చదివి హాయిగా నవ్వుకొన్నాము.

— సుజయ్‌శ్రీ ఆదోని

పండక్కి ప్రఖ్యాత రచయిత శ్రీయండమూరి వీరేంద్రనాథ్‌గారి కలం నుండి ఓ ధారావాహిక నవల వెలువడుతోందనే మీ ప్రకటన మమ్ములను ఆనంద పరవశులను చేసింది. చిటపట చినుకులలో 'వింధ్యవాహిని' గారు చిన్నపిల్లలు చేసే అల్లరి పనులను చాలా సహజంగా చిత్రీకరించారు. 'ముళ్ళచట్రం' ముగింపు బా గా లే దు. 'యర్రంసెట్టి సాయిగారి



**This walk-out is going to be a flop—he is following us with the speech!**

**66**

ఇంటర్వ్యూ' ఇప్పుడు రేడియోలో జరిగే కార్యక్రమాలకి అద్దం పట్టినట్టుంది. ఈ రచన చూసయినా రేడియోవారు కళ్ళుతెరిచి మంచి కార్యక్రమాలు అందిస్తారని ఆశిద్దాం. మైనంపాటి భాస్కర్ గారు 'అభిమానాన్ని' చాలా బాగా నిర్వహించారు. సమస్యలని పరిష్కరించుకోడానికి 'చావు'మార్గం కాకూడదని ప్రతి జీవి(తం)కీ ఒక ప్రయోజనం ఉంటుందనే సత్యాన్ని పాఠకులు గ్రహించేలా చేసారు. 'స్వర్గీయ మృత్యుంజయరావు'లో రచయిత మల్లిక్‌గారి స్టాండర్డ్ మామూలుగానే వుంది. ఎన్.రవిశంకర్ గారి జోకులు ఎక్కడో చూసినట్టు గుర్తు సీరియల్స్ మామూలే.

శలపాకరవి పెద్దారం

---

డియర్ సర్

గతనెలలో మీరు నిర్వహించిన కార్టూను పోటీలో కన్సొలేషన్ బహుమతులు పొందిన 2కార్టూన్లు శేఖర్ మరియు గుప్తగార్లు ఆర్.కె.లక్ష్మణ్ గారి "యుసెడిట్" 3,4పుస్తకాలనుంచీ మక్కీకి మక్కీ కాపీ చేసారు. వాటిమూల కార్టూన్లు మీకు ఫొటోస్టాట్ కాపీలు తీసి పంపుతున్నాను.



The Naga underground leaders are here, sir- here!

**86**

ఇకనుంచైనా ఇటువంటి కాపీకార్టూన్లను పత్రికలకు పోటీలకు పంపకుండా ఉంటారనే ఉద్దేశంతో మీకీవిధంగా రిఫరెన్స్‌తో పంపుతున్నాను. మీకు వీలైన పక్షంలో దీనిని జ్యోతిలో ప్రచురిస్తే ఇటువంటి కాపీ కార్టూనిష్టులను ఏవిధంగా సన్మానించాలో పాఠకులే నిర్ణయిస్తారు.

శలవ్... సూర్యనారాయణ (విజయ్)
కార్టూనిస్ట్ గోపాలపట్నం

అందాలతార "రేఖ" ముఖచిత్రంతో వెలుపడిన "జ్యోతి" మా ఇంటిల్లిపాదిని ముగ్ధులను చేసింది. ఈ సంచికలో యెర్రంశెట్టి శాయిగారు "హ్యూమరాలజీ-10లో "ఇంటర్వ్యూ" మమ్మల్ని కడుపుబ్బ నవ్వించింది. రచయిత శాయిగారికి మా ధన్యవాదాలు చెప్పండి. శ్రోతేశ్వరరావు పాత్ర వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది అనడంలో సందేహం లేదు.

పి. ఉమా మోహన్ కశీబుగ్గ

---

విఖ్యాత కార్టునిష్ట్ శ్రీ ఆర్. కె. లక్ష్మణ్ గారి... యూ సెడిట్ - 3

పైబొమ్మని శ్రీ శేఖర్ కాపీచేసి పోటీకి పంపి ప్రైజు సంపాదించారు!

యూ సెడిట్ - 4 పై కార్టూన్‌ని శ్రీ ఎల్; వి. ఆర్. రమణగుప్త కాపీ కొట్టి పంపి ప్రైజు పొందారు.

మా కార్యాలయానికి చేరే వందలాది కార్టూనులను ఎంపికచేసే పని వత్తిడిలో సంపాదకులు గానీ పోటీలలో నిర్ణేత గానీ ఏది స్వంతమో ఏది కాపీయో గుర్తు పెట్టుకోడం అసాధ్యం. కాపీ చెయ్యకుండా నిజాయితీతో వ్యవహరించడం ప్రతి కార్టూనిస్ట్ విధి సత్ప్రవర్తన మేధాశక్తిని ప్రతిభని కాదని అక్రమమైన, నీతిబాహ్యమైన యీ కాపీ పనులకు స్వస్తి చెప్పడం యీ ఇద్దరి కార్టూనిస్టుల మానసికారోగ్యానికి మంచిది.

యీ ఇద్దరి కార్టూన్‌లని ఇకపై జ్యోతి ప్రచురించ బోదని, పాఠకుల ముందు తెలియ పరుస్తున్నాం. ఊహాశక్తిని కాపీలకోసం వ్యయం చేసి కాపీ రచలని పంపి పాఠకుల ఆగ్రహానికి గురికావద్దని కార్టూనిస్టులకు, సవినయముగా మనవి చేస్తున్నాం.

||సం||

---

రచయితలకు కార్టూనిస్టులకు మనవి

తాము మా కార్యాలయానికి పంపినరచనలకు మేము తిప్పిపంపే విషయమై ఎట్టి బాధ్యత తీసుకోలేము. ప్రచురణకి ఆమోదించబడని రచనలు తిప్పిపంపే విషయమై ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. రిజిష్టర్డు పోస్టేజి, స్వంత చిరునామా గల కవర్లు జతపరచిన సందర్భాల విషయంలో మాత్రం బాధ్యత వహించగలము. ||సం||

---

# ప్రకటన

శ్రీ శ్రీ వ్యాసాలు రు. 15-00

పాడవోయి భారతీయుడా రు. 10-00

పై పుస్తకాలు విడుదలయ్యాయి. వాటి ధరతోపాటు ప్రత్యేకంగా ఒక్క రూపాయి కట్టి శ్రీశ్రీ సాహిత్య సభ్యత్వం పొందిన వారికి వెలువడబోయే శ్రీశ్రీ రచనలు ముందు అందించడం జరుగుతుంది.

శ్రీశ్రీ ప్రచురణలు, నెం. 1 సౌత్ బ్యాంక్ రోడ్, మద్రాస్-28.

# యండమూరి వీరేంద్రనాథ్



## పాఠకులకు అందించనున్న కొత్త సీరియల్ త్వరలో ఆరంభమవుతుంది

# మొగ్గలో ముల్లు

## శాండిల

ఉన్నట్టుండి హఠాత్తుగా ఆగిపోయింది దక్షిణ్ ఎక్స్‌ప్రెస్.

"ఇంకా భోపాల్ ఎంత దూరముంటుందో?" మలయప్పన్ ప్రశ్నించాడు.

ఎంత లేదన్నా గంట ప్రయాణం" కుంచప్ప జవాబిచ్చాడు.

"టైమెంత?" నాయర్ అడిగాడు.

"మూడున్నర. రెండుగంటలు లేటు" కుంచప్ప సమాధానం.

"ఎందుకింత సేపు ఆగినట్టు" ఇది మీనన్ సందేహం.

"ఇంజన్‌లో ఏదో భాగం చెడిపోయిందట బాగయ్యేసరికి చాలా సేపు పట్టవచ్చు."

"డ్రైవరునూ, గార్డునీ దర్యాప్తు చేసి వచ్చిన కుంచప్ప తేల్చాడు. అరే! బాప్‌రే ఇది అడివిలాగుంది.

తినడానికేమైనా" మలయప్పన్ విసుగు ప్రకటించాడు.

"తమ్ముడూ! అరణ్యమేమీ కాదోయ్. రైలుకట్టకు ఇటువున్న కమలా తోటలు చెప్పడంలేదూ! అవిగో చూడు. ఆగుత్తులలో సంత్రాలు నెల్లాళ్ళలో తేనెలు నింపుకొంటాయి" మందహాసంతో అందించాడు కుంచప్ప.

ఈ మాట్లాడు కొనేముగ్గురూ ఎవరనుకున్నారూ. దక్షిణ్ ఎక్స్‌ప్రెస్‌లో రిజర్వుడు కంపార్ట్‌మెంట్‌లో వున్న మిలిటరీ వాళ్ల నూరుకు పైగా దాంట్లోవున్న జవానులంతా కేరళావాండ్లే.

ఎక్స్‌ప్రెస్ ఎవరితోనూ చెప్పా చెయ్యకుండా ఆగిన ఆస్థలం మధ్య ప్రదేశ్‌లో ఓచక్కని మైదాన ప్రాంతం కనుచూపు మేర కమలాతోటలు; మధ్యమధ్యన గోదుమ విత్తనపొలాలు-ఆపచ్చపచ్చ పువ్వుల ఆవచేలు. సీలాకాలంవద్దామా వద్దా అని తొంగి చూస్తున్నదేమో ఆపైరు "ఎంతక్కతావే తల్లీ! రావమ్మా" అని స్వాగతం పలుకుతున్నట్టు ఆనందంతో తల యూపుతున్నాయి. శరత్కాలం కాదు మూడుదాటకుండానే ఎండ నీరెండగా వాలిపోతోంది.

మళయాళీ సైనికులున్న రైలుపెట్టె కట్టెదుట వున్న కమలాతోటలో రైతు టొమేటో పాదులు లాగుందిచక్కగా పెంచాడు. సంత్రాచెట్ల బారుల మధ్య నాగటి చాళ్లలో టొమేటా మొక్కలు నాటారు. అరగజం యెత్తుపందిరి కాని పందిరిగా పాతబడ్డ తేలిక పాటి వెదురు బద్దల్ని చిక్కంలా కలుపుతున్నాయి

మరో ఇరవై నిమిషాలు నిశ్శబ్దం పిల్లగాడు ఇంత చేసాకీ గా పళ్ళు రాల్చేదీ గుర్తుప్పగించి మలయాళీలు చోద్యంగా చూస్తున్నారు. కొందరప్పుడే మొదటి బుట్టలో పళ్ళ రసం సొంతం పీల్చెయ్య పట్టు లంకించుకున్నారు. రోజూ వినూకు ఆపని అలవాటే గనక ఒక్క పండేనా చిదక్కుండా రెండుబుట్టలనిండా కోసు కొచ్చాడు. జవానుల ఆనందానికి అవధు ల్లేవు. నాయర్‌ని అడిగి మీనన్ అయిదు రూపాయల నోట్లఅయిదు క్రొత్తవి వినూ చేతిలోకుక్కి ఆప్యాయంగా బుట్టలందు కొని కంపార్ట్‌మెంట్‌లో వాటిని ఖాళీచేసి ఆ కిరీలు కిటికీలోంచి విసిరేశాడు,

దక్షిణ్‌ఎక్స్‌ప్రెస్ కూతబెట్టి గబు క్కున ఓలాగులాగింది. కుదుపుతోనే ఎంతోవేగం పుంజుకొంది రైలు. వాళ్ళు కనబడినంతసేపు వినూ అటేచూస్తూ కుంచప్ప, నాయర్, మీనన్‌లు చేతు లూపుతూ 'టాటా' చెబుతూంటే కిలకిం నవ్వుకొన్నాడు,

"ఆ బండి తిరిగిరాదు వచ్చినా అక్కడ ఆగదు. ఆగిందే అనుకో ఆ రిజర్వుడు కంపార్ట్‌మెంట్ వుండదు. ఒకవేళవున్నా వేలాదిమైళ్ళ పర్యంతం విస్తరించివున్న మనదేశ సరిహద్దుల్ని అహర్నిశలూ కావలిగా సేందుకుప్రాణాల్ని సైతం పణంగా ఒడ్డే ఆ సైనికులు రారుగా! అథవా వస్తారనుకొన్నా వాళ్ళకి మళ్ళీ తన టొమేటోలు కావాలిగదా!"

ఇవన్నీ మీకూ నాకూ తెలిసివున్న నగ్న సత్యాలు మరి వినూకోఏమో చెప్పడం ఏమంత తేలికకాదు.

* * *

సంతోషంలో వినూకి సాయంత్రం ఇట్టే అయిపోయింది. ఖాళీ బుట్టలు మంచె క్రింద ఆరిన గోధుమ గడ్డి మడతల్లో దాచేసి ఇంటి మొగం పట్టాడు. దారిలో ఆచిన్న వినూ మెద డులో ఎన్నెన్నో పెద్ద ఆలోచనలు సుళ్ళు దిరుగు తున్నాయి.

"ఇవేళ నే చేసిన ఈ లాభసాటి బేరానికి అమ్మా, నాన్నా నన్ను ఎత్తుకు దింపను, ఏదో దారి దప్పి ఈగేలం తగిలింది గానీ రోజూ రావద్దు-ఆం-అదే వస్తుంది. 'దినాలు బావుంటే దీనారాల కేం కొదవ?' అన్నారు పెద్దలు. ఇక నుంచి నేను మానాన్నను "నన్నూ మార్కెట్టుకి తీసుకెళ్లాలి టొమేటోల బళ్ళతో; సంత్రాల లారీలల్లో" అని పేచీ పెట్టవచ్చు. అదీ కాదంటే అమ్మ తో చెప్పి సిఫారసు చేయించుకోవచ్చు.

పోనీ నాన్న మాట ఏ లాగున్నా అమ్మ నన్ను ఎంతగానో మెచ్చు కుంటుంది. ఔను-మరి-నాన్న టోకు అనీ గీకు అనీ బుట్ట రెండున్నరకి మించి అమ్మకమే లేదు. నేనో బుట్ట ఎనిమిది రూపాయలకు తక్కువగాకండా అమ్మేశాను. పోనీ ఆ కొనుక్కున్న వాళ్ల

# రూ॥ 5,000 బహుమతి

ఎర్రగులాబీలు, మౌనగీతం, టిక్...టిక్...టిక్, అభిలాష మొదలగు చిత్రాల నిర్మాతలు జ్యోతిలో ధారావాహికంగా ప్రచురింపబడి విశేష ప్రశంస పొందిన ప్రఖ్యాత రచయిత యండమూరి వీరేంద్రనాథ్ డబ్బుడబ్బు నవలను చిత్రంగా రూపొందిస్తున్నారు. జనవరి 84లో ప్రారంభం అవబోయే యీచిత్రంలో ముఖ్య పాత్రధారులు చిరంజీవి, సుహాసిని, విజయశాంతి.

**జ్యోతి పాఠకులకు బహుమతి**

యీనవలలోని రామ్మోహన్‌రావు, ప్రియంవద హనుమంతరావు, విద్యార్థి, అంజిరెడ్డి వార్డ్‌బాయ్ పాత్రలకు సరియైన తారాగణాన్ని చిత్రానికో మంచిపేరు సూచించిన వారికి రు. 5000/– బహుమానం. సూచనలు పంపేందుకు ఆఖరు తేది 30–12–1983.

పంపవలసిన అడ్రస్ :

**క్రియేటివ్ కమర్షియల్స్** 5 నార్త్ వుస్మాన్‌రోడ్,

టి. నగర్, మద్రాస్-600 017.

గొడవజేశారా కొసరారా అంటే అదీ లేమగా! నవ్వు మొగాలతో ఆనందంగా అందు కొన్నారే వాళ్ల పళ్ళన్నీ...

వచ్చే పంపక్కి అమ్మను నాకొక క్రొత్త షరాయీ, షర్టూ కుట్టించమని మారాం చెయ్యాలి! మరింక నన్ను రోజూ "దిష్టిబొమ్మా! సున్నపు పిడతా! అని నలుగురూ నవేట్టు తిట్టవుగా అని ధాటి చెయ్యొచ్చు..."

వినూకు ఏవేవో కొత్త హక్కులు అప్పటి కప్పుడే పుట్టుకు వచ్చినట్టు; హఠాత్తుగా మెజారిటీ తన మీద రెక్కలు గట్టుకు వాలినట్టు విర్రవీగి పోసాగాడు.

తనకి క్రొత్త నోట్లంటే ఎంతో సరదా అమ్మను ఏలాగేనా సరే ఒప్పించి ఆ అయిదు కొత్త కాయితాలు పెట్టెలో తాను ఈనాడు చేసిన ఘన కార్యానికి గుర్తుగా కలకాలం కర్చు చేయకుండా దాచుకోవాలని వినూ ఉబలాటం!

కొడుకు వినూ గడప త్రొక్కుతూనే వాడిలో త్రొక్కిసలాడే ఉత్సాహం ఇట్టే పసిగట్టింది గంగాభవాని. ఆపరవళ్లకి కారణం ఆమెకు అంతు చిక్కడం లేదు.

"అమ్మా!" బిగ్గరగా కేక పెడుతూ కౌగిలించుకోబోయాడు తల్లిని వినూ.

"ఏమిట్రా హడావుడి వినూ? ఇంతకీ ..." భవానీని ముగించనీయ కుండానే.

"చెప్పుకో చూద్దాం" పొడుపు కథ విసిరాడు తల్లి మస్తిష్కంలోకి సూటిగా

ఈ సమస్య భవానీని కొంచెం కిరు కున బెట్టింది. కొడుకు కిటుకు పోల్చు కోలేక ఓటమిని ఒప్పుకుంటూ "బాబూ విసిగించక చెబుదూ" అనేసింది.

"ఈవేళ ఈ వినూ దక్షిణ్ ఎక్స్ప్రెస్ ను ఆపేశాడు".

ఛా—ఏంమాటలురా అవీ-భోపాల్ లోనే గాని మరెక్కడా ఆగదు ఎక్స్ప్రెస్—ఆమాత్రం తెలీదా నీకు?"

"అమ్మా—ఔనే-నేనూ ఎరుగుదును. అయితే దాన్ని ఈ వేళ తోట యెదుట ఆపుచేయించా—లేదే అదే ఆగిపోయింది. నిజం" పకపక నవ్వాడు వినూ.

"ఇదీ విడ్డూరమే? పైస్టేషనులో ఏదో బండి లైను మీద వుండి వుంటుంది. సిగ్నలు ఇచ్చి వుండరు"

"ఏది ఏమైతేనేం ఆగిపోయింది ఎక్స్ప్రెసు" "సరే—ఆగిందే అనుకో—అందువల్ల మనకు ఒరిగిందేమిటి?"

"అదే చెప్పనియ్—బండి ఆగింది. నేను ఎక్కాను" అని ప్రారంభించి కథ సాంతం ఆంగికాభినయంతో రసవత్తరంగా వినూ భవానికి పూసగ్రుచ్చినట్టుగా చెప్పాడు.

కథలో మెరికల్లాగ ఒకటి రెండు సంగతులు భవానీని ఆశ్చర్యంతో ముంచెత్తాయి. కొడుకు చేసిన పనికి మొదట్లో విప్పారిన ఆయమ్మ ముఖం ముగింపు కాడికి వచ్చేసరికి ముడుచుక పోయింది. ఇది చూసిన వినూకు చెప్ప లేని నిరాశ ఎదురయ్యింది. అమ్మతే

ఏిందుకలా మూగపోయింది? ఇప్పుడు చిక్కు విప్పుకోవడం వినూ వంతు కావడంతో చిన్నవాడు మరీ చిన్న బోయాడు. నన్ను ఆకాశానికి ఎత్తివేయాల్సిన అమ్మ తన్ను అదే యావగా చూస్తూతానేదో కానిపని చేసినట్లు బిక్క పోతున్నదే! ఇందులోనేచేసిన తప్పేమిటి? అమ్మతోగాని నాన్నతోగాని చెప్పకండా తోటలో టొమేటోలు కోసినా లాను వాటిని నాన్న అమ్మేకంటే హెచ్చుధరకే అమ్మేడుగా! లాభమే వచ్చిందే. తనలో తానే మౌనంగా తర్కించు కొంటున్న వినూను నిలవేసింది. భవాని.

"మాడు నినూ! ఎన్నడూలేనిది నీకంత పేరాస ఎందుకు పుట్టిందీ? టోకు బేరం నాన్న టోకిరీ రెండున్నరకే యిచ్చేస్తారనుకో చిల్లరగానైతే దానికి రెట్టింపు- అంటే అయిదురూపాయలు అదృశ్యంగా వచ్చింది గదా అని పదిరూపాయలంటావురా బుట్ట? కొనుక్కొనే వాళ్ళు పరదేశులు ఆకలిగా వుండో అహ్లాదానికనో మోజుపడితే ఆ తీపిమీద గుంజుకోగూడదు డబ్బు అని నీకెలా తెలియకపోయిందిరా? అవతలివారు పదో పరకో చేతబెడుతున్నారని చాపెయ్యడమే అందుకునేందుకు? అదీ తప్పేనుకో నువ్వు అంతకుమించిన నేరం చేశావు. ఏది తెలిసినా ఏమి తెలియకపోయినా నీకు టోకిరి టొమేటోలు ఈనాటిధర రెండున్నర లేదా మూడుమించి వుండవని అనుకోలే నంత మూర్ఖుడవయ్యావా? నాలుగులేవంటే అయిదు అడగాలి కాని ఒక్కసారిగా పది లాక్కోవాలన్న దుర్బుద్ధీ నీకెలా అబ్బిందీ? పుట్టిందే తడవు పాడుపని చేశావు. తగుదునమ్మా అని కొత్త అయిదురూపాయలినోట్లు అయిదూ వాళ్ళిచ్చేరు గదా అని పట్టుకొచ్చావు.

సరే ఇప్పుడులేదంటే ఆ జవానుల వద్ద పదిరూపాయలు పెన్ను పుచ్చుకొన్నావు. అదివాళ్ళకి తిరిగి ఇచ్చెయ్యాలి. లేకపోతే జనని భవానీమాత మనకి నూరురూపాయలు జుల్మానా విధిస్తుంది బాబూ! రేపు ధరపడిపోయి లేదా గాలి దుమ్ము రేగిగాని చీడపురుగు దొలిచి గాని బండెడుపండ్లు చెడిపోతే అదెందురు దాపురించినాసరే ఇందువల్లనే నీ మూలాన్నే ముప్పు వచ్చిందేమో అని నాన్నా నేనూ దిగులుతో కుమిలిపోవాల్సిందే" అమ్మ ఇంకా దండకంలో మంచిచెడుల తారతమ్యాల్ని కోపుగుచ్చి వల్లిస్తూనే వుంది.

వినూ పొంగు చల్లారి పోయింది చప్పగా చిర్ర పీగడం ఇలా విరిగి పోతుందని ఆబిడ్డ సుంతైనా కానుకో లేక పోయాడు. అమ్మను ఎంతో సంతోష పెడతానని ఆపసికందు

కన్నుకల కరగి నీరైపోయి రెండు కళ్ల వెంబడి పైకుబికి ఉబికి వస్తోంది. "ఇంక ఎప్పుడూ ఇలాంటి తప్పు చెయ్యనమ్మా క్షమించవూ" తల్లికి గూడా కళ్లనీళ్ల గమ్మాయి—

క్షమాభిక్ష వేడుకొన్నాడన్న మాటే గాని వినూ మెదడులో రైళ్లు పరుగు పెడుతున్నాయి. ఊహలు పాదరసంలా ప్రాకి పోతున్నాయి. మెరుపులాగ ఓ ఆలోచనతట్టి "అమ్మా! ఓపని చేస్తేనో" దీనాతి దీనంగా ప్రతిమాలుతున్నాడు.

"ఏమిటీ"

"అమ్మా—రేపు సరిగ్గా ఆసమయానికీ రైలు పట్టాల దగ్గర ఆగి ఎర్రజెండా వూపి ఎక్స్ప్రెస్‌ను ఆపేస్తా"

"అయ్యయ్యో ఏమి ఆలోచనరా అదీ?

"కానే—ఏం(విటంటావేం— బండిని నిలబెట్టి వాళ్ల రూపాయలు వాళ్లకిచ్చేస్తా"

రాత్రి భోపాల్ నుంచి వచ్చిన మాధవ్‌తో భార్య భవానీ వినూ చేసిందంతా చెప్పింది. విన్న ఆయజనూని విస్తుపోతూ "భవానీ! మనవాడు కొంత తెలియక చేశాడు ఆ తప్పు. తెలియక జేసినా తప్పుకు శిక్ష అనుభవించాల్సిందే అన్నారు.

క్రమంగా రోజులు దొర్లిపోతున్నాయి వినూ మాత్రం జరిగిన దానికి నివారణగా ఏమిటి చెయ్యడం? అని అనుక్షణం సంశోధనలో నిమగ్నమయ్యే వుంటున్నాడు.

ఓనాడు వినూ చదువుకొనే బడిలో మాష్టారు అనుకోకుండా వాళ్ల యింటికి వచ్చాడు. మాధవ్ ఆవేళా లేడు వూళ్లో—భోపాల్ వెళ్లాడు. ఆసమయంలో వినూ గూడా లేడు "భవానీ—నీకో శుభవార్త చెప్పేందుకొచ్చాను".

"పెద్ద పెద్ద వాళ్లకు గూడా తట్టని గొప్ప బుద్ధి చిన్నవాడు వినూకి పుట్టిందమ్మాయ్"

"ఏమిటి మాష్టారూ మీరనేది" భవాని ఆశగా అడిగింది.

"నిజంగా వాడు మీబిడ్డ అనిపించుకొన్నాడనుకో దేశభక్తి, ఉదారత్వం, మంచితనం పుణికి పుచ్చుకున్నాడంటే నమ్మూ"

"సరిహద్దుల్ని ప్రాణాలొడ్డి అహర్నిశలు దేశభక్తితో అష్టకష్టాలకూ ఓర్చి పోరాడే జవానుల కోసం వినూ ఇవాళ రక్షణ నిధికి పదిరూపాయలు విరాళంగా యిచ్చాడు ఇస్తూ రసీదులో ఏమని వ్రాయమన్నాడో తెలుసా?" "......" ఇదీ ప్రశ్నార్థకమే మౌనరూపం దాల్చిన భవానీ చూపు.

మాష్టారూ! ఈ ద్రవ్యం మా అమ్మ భవానీ, నాన్న మాధవ్‌లు సమర్పించిన చిన్న కానుకగా వ్రాయించండి" అని ప్రాధేయ పడ్డాడు". "..." చివరి చరక విన్న భవానీ రెండు కళ్లనుండి చివాల్న రెండు బిందువుల్ని భారంగా బయటకు నెట్టింది. మరి అవి ఆనంద బాష్పాలో దుఃఖాశ్రువులో ఆతల్లి భవానీ మాతకే...కాదు భారతమాతకే యెరుక.

# భూతం

ఆమె అటకమీదనుంచి క్రిందకు చూసింది!

నేలనిండా దుమ్ము పేరుకుపోయి ఉంది. గోడలు మాసిపోయి ఉన్నాయి. మాసినగోడలమీద సాలెపురుగులు తమాషాగా పాకుతూ కదుల్తున్నాయి.

గదినిండా ముతకవాసన!

మూసివున్న కిటికీతలుపుల సందుల్లోంచి సన్నని వెలుగు గదిలోకివస్తోంది.

మళ్ళీ పగలయింది!

ఇంకా ఇలాటి పగళ్లు మూడు, రాత్రులు మూడు ఇంకా గడవాలి!

అపుడు, తాను కోరుకున్న క్షణాలు వస్తాయి!

ఆమె అటకమీదనుంచి క్రిందకు దుమికింది!

మెల్లగా తలుపుసందుల్లోంచి ప్రక్కగదిలోకి వెళ్ళింది. అదే పడకగది!

ఆ గదిలో మంచంమీద పాతపరుపు ఒక్కటేవుంది. కొత్తపరుపు, దుప్పట్లు ఏవీలేవు. గదిలో బట్టలస్టేండు బోసిగా వుంది.

తూర్పు గోడకున్న 'వార్డ్‌రోబ్' తలుపులు బోర్లా తెరిచి ఉన్నాయి. వాటి అరల్లో పాతపేపర్లు, చిరిగిపోయిన చందమామ పుస్తకాలుతప్ప వస్తువులు ఏవీలేవు. బొద్దింకలు గోడ కంతల్లోంచి బయటకువచ్చి అరల్లో ఇటూఅటూ పాకుతున్నాయి.

గోడకు బిగించిఉన్న ట్యూబ్‌లైటు చుట్టూ ఏవోపేరు తెలియని పురుగులు చిన్నచిన్న గూళ్ళుకట్టేయి.

మూసివున్న కిటికీ దగ్గరలోనే పెద్ద టేబిలువుంది! దానికిఆన్చి నిలువుటద్దం ఉంది. టేబిలుమీద పాతగుడ్డ, జోళ్లు తుడిచే బ్రష్ అస్తవ్యస్తంగాపడివున్నాయి.

ఒక బల్లి టేబిలుమీదకు పాకివచ్చి పురుగుల్ని పట్టి తింటోంది.

అద్దంముందు ఖాళీఅయిపోయినబొట్టు సీసా పడివుంది.

ఆమె అద్దం ఎదురుగా నిలబడింది!

అద్దంలో ఆమెకు తన ప్రతిబింబం కనిపించలేదు!

ఆమెకు ఏడుపువచ్చింది!

అంతలోనే కోపంవచ్చింది!

వెంటనే ఆవేశంకూడా వచ్చింది!

ఇంకా మూడురోజులు గడవాలి.

## ద్విభాష్యం రాజేశ్వరరావు



అంతవరకూ ఓపిక పట్టాలి. ఆ తరువాత తానుచేయబోయేపని తలుచుకుంటే సంబరం వేసింది,

ఆమె మెల్లగా మంచంవద్దకు వెళ్ళి పాతపరుపుమీద కూలబడింది.

మంచం నాలుగు మూలలూ ఆప్యాయంగా తడిమింది. తలవైపునవున్న పాత తలగడవైపు ప్రేమతో చూసింది.

ఆమంచాన్ని వదల్లేకపోతోంది ఆమె!

సరిగ్గా, పదహారునెలలక్రితం ఒక నాటిరాత్రి ఈ పరుపుమీదే జీవితంలోని మొదటి తీపి అనుభవాన్ని రుచిచూసింది ఆమె! ఆ తీపి అనుభవంతోపాటు తాను కోల్పోయిన శీలంవిలువ అమూల్యమని కొద్దిరోజుల తరువాతే ఆమెకు తెలిసింది. ఆసంఘటన ఎంతమరచిపోదామనుకున్నా మరుపుకు రావటంలేదు.

పదహారు నెలలక్రితం ఆ రాత్రి—

తొమ్మిది గంటలవేళకు అంటుగిన్నెలుతోమి వంటింట్లో బోర్లించింది. తరువాత పెరటితలుపులు బిగించి వచ్చింది. గ్లాసుతో మంచినీళ్ళుతెచ్చి పడకగదిలో వుంచి "బాబుగారూ! నేను వెళ్తున్నా! వీధి తలుపులు వేసుకోండి!" అంది అతనితో.

అతడు చదువుతున్న పుస్తకంమూసి "అంత అర్జెంటుగా వెళ్ళాలా? ఇంకో గంట ఆలస్యంగావెళ్తే కొంపలంటుకుంటాయా?" అన్నాడు నవ్వుతూ.

ఆలస్యమైనా ఫర్వాలేదు. పనివుంటే చెప్పండి!" అంది మామూలుగానే.

అతడు మెల్లగా మంచందిగి వచ్చేడు.

"చూడు! అమ్మగారు, పిల్లలు యీ వేళ వూరువెళ్ళేరుకదా! రేపు సాయంకాలందాకా రారు. అందుకని ఇంట్లో అవసరాలన్నీ నువ్వేచూడాలి." అన్నాడు.

"అలాగే బాబూ! అమ్మగారుకూడా చెప్పేరు. రేపు ఉదయం ఆరోగంటకల్లా వచ్చేస్తా. మీ కాఫీ, వంట అన్నీ నేనే చేస్తాను. ఆఫీసుకి ఆలస్యంకాకుండా కేరియరు కట్టిస్తాను." అంది.

అతడు నవ్వుతూ "అంతేనా? మరి మిగిలిన పనుల్లో? అన్నాడు.

ఆమె అతనివంక అనుమానంగా చూసింది. అతనివంటిమీదనుండి మత్తయిన సెంటువాసన తెరలావచ్చి ఆమెను కమ్మింది. అతడు చనువుగా దగ్గరకు వచ్చి ఆమెచెయ్యిపట్టుకున్నాడు. గాజులు గలగలమన్నాయి.

ఆమె మనసు రెపరెపలాడింది!

యవ్వనంలోకి ప్రవేశించేక మొట్టమొదటి పురుషస్పర్శ అది.

ఆమె భయంతో వణికిపోయింది.

అతనితో పెనుగులాడాలనుకుంది.

గట్టిగా గొంతెత్తి అరవాలని కూడా అనుకుంది.

అతణ్ణి బలంగా దూరానికి నెట్టివేయాలని అనుకుంది.

కానీ, ఏమీచేయలేకపోయింది.

అతడు ఆమెను పూర్తిగాఆక్రమించుకున్నాడు రెండునిమిషాల్లోనే!!

"అమ్మగారు చిలకలా వుంటారు కదా! నామీద మోజెందుకు బాబూ!" అని అడిగింది అరగంట తరవాత మంచం మీదనుండి లేస్తూ.

అతడు చిరునవ్వుతో "చిలకల్లో చాలా రకాలుంటాయి. ఒక్కో చిలకది ఒక్కో అందం!" అన్నాడు.

తరువాతిరోజునే అమ్మగారు, పిల్లలు వూరినుండి తిరిగివచ్చేశారు.

అతడు ఆమెను మరిచిపోయాడు.

అమ్మగారూ, అతడూ పడకగదిలోకి వెళ్తూవుంటే చాలారోజులవరకూ అసూయగా వుండేది ఆమెకు.

దినాలు గడుస్తున్నకొద్దీ ఆ అనుభవాన్ని మరిచిపోవాలనుకుంది. అయితే, తను అనుభవించిన ఆనందం యొక్క ఫలితం తనలో ఏర్పడుతోందని ఆమెకు ఆలస్యంగా తెలిసింది. ఆ సంగతి తెలి

నేక ఆమెకు ఆ రాత్రి నిద్రపట్టలేదు! ఒడలంతా చెమటలు కమ్మేయి.

గుండె భయంతో అవిసిపోయింది!

మరునాడు రహస్యంగా అతనితో అసలు విషయం చెప్పేసింది.

"కొంప ముంచేవ్!" అన్నాడు అతడు బెదిరిపోతూ. ఆ మాట అన్నప్పుడు అతని ముఖంలోని భయాన్ని స్పష్టంగా చదవగలిగింది.

ఆమెకు ఏం మాట్లాడాలో తోచలేదు!

కొంప ముంచింది అతడే! పైగా తన మీదకు తప్పు తోసేస్తున్నాడు.

"సాయంకాలం మాత్రలు తెచ్చి పెరటిగూట్లో పెడతాను. వేసుకో!" అన్నాడు. అలాగేనన్నట్లు మౌనంగా తలవూపింది.

ఓ సాయంకాలం కనుచీకటి పడేవేళ పెరట్లో తారాడుతూ గొణుగుతున్నట్లు అడిగేడు అతడు "ఏమయింది?" అని.

"ఏమీ అవలేదు!" అంది.

"సరేలే!" అంటూ కాలుకాలిన పిల్లిలా వెళ్ళిపోయేడు.

'సరేలే' అంటే అతని నిర్ణయం ఏమిటో ఆమెకు అర్థంకాలేదు. కాని అదే రాత్రి ఎనిమిది గంటలవేళ బెడ్‌రూంలో టేబిలు ఫేను అమర్చి ప్లెగ్ పెడుతూ వుంటే కొంత అర్థమయింది. పూర్తిగా అర్థం చేసుకునే లోగానే ఏదో బలమయిన శక్తి ఆమెను తోసేసింది. వెనుక నుండి కర్రతో అదిమిపెట్టి కరెంటుషాక్‌తో అతడే చంపేశాడని ఆమెకు అర్థమయింది.

ఆమె చచ్చిపోయింది!!

ప్రమాదవశాత్తూ కరెంటుషాకు తగిలి చనిపోయిందని అతడు అందరికీ చెప్పేడు. మంచిపని మనిషి చనిపోయిందని ఇంట్లో అందరూ కన్నీళ్ళు పెట్టుకున్నారు. అతడూ కన్నీళ్ళు కార్చేడు!

చనిపోయిన నక్షత్రం మంచిది కాదు కనుక ఏడాదిపాటు ఇంటిని పాడు పెట్టాలన్నారు. ఇంటిలో సామాన్లన్నీ వేరే అద్దె ఇంటిలోకి మార్చి ఈ ఇంటికి తాళాలువేసి వెళ్ళిపోయారు.

అప్పటినుండీ, ఆమెఇక్కడే గడుపుతోంది. ఆమెకు ఆకలిలేదు! నిద్రలేదు! దాహం అంతకంటె లేదు! ఒకే ఒక కోరిక మాత్రం వుంది.

అన్యాయంగా తనను హత్యచేసినందుకు అతన్ని, ఆ సంసారాన్ని పట్టుకు పీడించాలని! వాళ్ళను అనుక్షణం హింసించాలి!

అతడూ, అతని భార్యా చాలా అన్యోన్యంగా వుండేవారు. పిల్లలిద్దరూ కూడా బొద్దుగా ఆరోగ్యంగా ముత్యాల్లా వుండేవారు. చక్కని కుటుంబం వాళ్ళది. తనతో సాంగత్యం, తరువాత తనకు చేసిన అన్యాయం తప్ప అతడిలో చెడ్డ గుణాలు లేవు! దురలవాట్లు కూడా ఏవీ లేవు! తనతో సాంగత్యంవున్నా, భార్యను మాత్రం ప్రాణంలాగే చూసుకునేవాడు. అతడిని బాధించాలంటే అతని భార్యా పిల్లల్ని హింసించాలి. వాళ్ళనిపట్టి పీడించాలి! రకరకాలుగా వాళ్ళని బాధ పెట్టాలి!

Colgate
DENTAL CREAM
Colgate
STOPS B

కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్ల ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు ముక్కల్లో దుర్వాసనా, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు ముక్కలన్నీ, సూక్ష్మజీవులని తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుండి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారి భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి

**దీని తాజా పిప్పరమెంటు రుచి మీ కెంతో నచ్చుతుంది!**

అపుడు అతనిలో కలిగే దుఃఖం చూస్తే కసితీరుతుంది! అతడిని చంపటం ఆమె ధ్యేయం కాదు! ఆ కుటుంబాన్ని పీడించటమే ధ్యేయం!

ఆమె కోరిక తీరటానికి ఇంకామూడు దినాలు గడువుంది.

ఈ మూడు దినాలలో ఈ ఇంట్లోకి వచ్చేస్తారు అతడూ. భార్యా. పిల్లలూ!

అపుడు తన పథకం ప్రారంభించాలనుకుంది ఆమె.

మంచం దిగిమళ్ళీ ముందు గదిలోకి వచ్చింది.

ఒక్క ఉదుటున ఎగిరి అటక ఎక్కింది.

అటక మీద ఒకమూల కూలబడింది మళ్ళీ క్షణాలు లెఖ్ఖపెడుతూ!!

*   *   *

మూడు దినాలు గడిచి పోయాయి.

నాలుగో దినం ఉదయం భళ్ళున ఆఇంటి తలుపులు తెరుచుకున్నాయి.

ఒక్కసారి గాలీ, వెలుతురూ లోనికి చొరబడితే ఉక్కిరి బిక్కిరి అయిపోయింది ఆమె.

అటక మీద ఒకమూలకు వెళ్ళినక్కి కూర్చుంది!

గది తలుపులన్నీ తెరుచుకున్నాయి.

కిటికీ తలుపులు తెరిచేసరికి ఇంట్లోకి వెల్తురుతో బాటు ఎండ కూడా వచ్చేసింది!

ఇంటినిండా హడావుడి! ఇల్లంతా తుడిచేసి! నీళ్ళతో కడిగేరు!

ముగ్గులు పెట్టేరు! గదిలో హోమం పెట్టేరు. మంత్రాలు చదివేరు బిగ్గరగా పూజలూ, పునస్కారాలు చేసేర్కు.

తంతులన్నీ ముగించేక భోజనాలు పెట్టేరు.

పగలంతా హడావుడిగా జరిగింది!

వెలుతురు తట్టుకోలేక ఆమె అటక దిగిరాలేదు. అదీకాక ముగ్గులూ, పూజలూ చూస్తే ఆమెకు క్రిందికి దిగి రావటానికి కూడా భయం కల్గింది. సాయంకాలం చీకటిపడే సమయంలో అటక చివరకు వచ్చి మెల్లగా చూసింది. పిల్లలిద్దరూ బొద్దుగా తయారయ్యేరు. గనగునలాడుతూ ఇంట్లోచలాకీగా తిరుగుతున్నారు. అతడూ, అతనిభార్యా మాత్రం కొంచెం సన్నబడినట్లు అనిపించింది. అతని భార్యముఖంలో మునపటి చలాకీ తనం లేదు. కాంతితో వెలిగిపోయే ఆమె కళ్ళు వెల వెల బోతున్నట్లు అనిపించింది. అతడు మనిషి బొక్కినా, ముఖం మాత్రం ముగ్గలతో లావెక్కింది. ఇంతకు ముందు లేని చిన్న బొజ్జ వేరుగా కనిపిస్తోంది మనిషిలో మునపటి దృఢత్వం లేదు. అతడి కళ్ళ క్రింద నల్లని చారలు ఏర్పడ్డాయి. ఈ ఒక్క సంవత్సరంలోను అయిదు సంవత్సరాల వయసును మింగిన వానిలా అతడు కనబడ్డాడు.

ఆ రాత్రి అలికిడి ముగిసేదాకా అటక దిగిరాలేదు ఆమె!

తరువాత మెల్లగాదిగి పిల్లలగదిలోకి వెళ్ళింది. వాళ్ళిద్దరూ నిద్రపోతున్నారు తరువాత అతడి గదిలోకి వచ్చింది. అతడిగదిలో కొత్తమంచంమీద కొత్త

పరువువేసి మంచి దుప్పటి పరిచిన్పు... గది స్వరూపమే మారిపోయినట్లనిపించింది. అంతా అమర్చినట్లు చక్కగా తయారయివుంది. దుమ్ము పేరుకుపోయి నిన్నటిపరకూ చెత్తగావున్న నేల ఇపుడు తళతళా మెరిసిపోతోంది.

అతడు కుర్చీలోకూర్చుని వున్నాడు!

అతడి ఎదురుగావున్న టీపాయ్‌మీద గ్లాసు, సీసా వున్నాయి! సీసాలోద్రవం తళతళలాడుతోంది. ఇది అతడికి కొత్త అలవాటు అనుకుంది ఆమె! దగ్గరలోనే అతడి భార్య నిలబడివుంది. కనులు నిండిన నీళ్ళతో! ఆమె క్షణంసేపు భార్యాభర్తలవంక చూస్తూ వుండిపోయింది.

"ఏమండీ! మీకు పుణ్యంవుంటుంది. నామాట వినండి. ఈ పదకొండు నెలల్లోనూ మీరు ఎంత మారిపోయారో మీకు తెలియడంలేదు. ఆరోగ్యం పూర్తిగా నాశనం కాకముందే దీన్ని మానండి!" అంటూ అభ్యర్థిస్తోంది భార్య.

"మొదలెట్టావా మళ్ళీ! ఫో! ఇక్కణ్ణుంచి! రోజూ వెధవసోద! నేను తాగుతాను! నువ్వు అరచి గింజుకున్నా మానను! నాఇష్టం! నాడబ్బు! నేను తాగుతాను!" అతడి మాటలు ముద్దగా వున్నాయి.

అతడికళ్ళు చింతనిప్పుల్లావున్నాయి. అతడి ముఖం మనిషిరక్తం రుచి మరిగిన పులిముఖంలావుంది. అతడి జుత్తు చెదిరిపోయి అస్తవ్యస్తంగావుంది.

"ఏమండీ! మీకిది న్యాయంకాదు! ఇది మొదలుపెట్టిననాడే మీకు చెప్పేన్ను! అలవాటయితే మానలేరని! మొదటిరోజు పార్టీలో బలవంతంవల్ల తాగేనన్నారు. తరువాత స్నేహితులకోసంతాగేనన్నారు. తరువాత కంపెనీకోసం తాగేరు. తరువాత్తరవాత పార్టీలు పోయాయి, స్నేహితులు పోయారు. కంపెనీ, ఒంటి నెప్పులు అన్నీపోయాయి. పోయినంత ఆస్తీపోయింది! ఆరోగ్యమూపోయింది! ఇంకా ఎందుకండీ ఈ అలవాటు? దయచేసి నాకోసం మానెయ్యండి. ఈ అలవాటుతో మీరు బంధువుంమధ్య స్నేహితులమధ్య ఎంత చులకన అయిపోతున్నారో గుర్తించేరా? ఏనాడూ చేయిచాచీ ఒక్కరూపాయికూడా ఎవరిదగ్గరా అప్పు చెయ్యనిమీరు, నెలాఖరురోజుల్లో విస్కీసీసాలకోసం అప్పుతెస్తున్నారు. క్రితంవారంలో మీరు తీసికెళ్ళిన చేబదులు తిరిగి ఇవ్వమని పక్కింటాయన వాళ్ళ అబ్బాయిని మన ఇంటికి కబురంపితే నేను సిగ్గుతో ఎలా కుచించుకుపోయానో మీకు తెలీదు. మీరు గదిలో సీసా, గ్లాసుతో కూర్చుంటే గదివంక చూడడానికే వణికిపోతున్నారు పిల్లలు. వాళ్ళకీ మీకు మధ్య పెద్ద అగాధం ఏర్పడిపోతోంది. మీరొక్కదినం కేంపువెళ్తే

షెం గ ట్టు క్ష హా యే పిల్లలు ఇప్పుడు మిమ్మల్ని చూస్తేనే జడుసుకుంటున్నారు. ఎందుకని? మీకు చికాకు ఎక్కువయి పోయింది. కోపంఎక్కువయిపోయింది. తాగుడుతప్ప ఇంక దేనిమీదా మీకు ఆసక్తిలేదు! ఇంట్లోవచ్చిన మార్పు లన్నిటికీ మీ తాగుడే కారణం! ప్లీజ్! నేను కోరుకునేది ఈ ఒక్కటే! ఈవ్యస నం మానెయ్యండీ! మీరుమునపటిమనిషి అవండి! అంతే!" అతడిభార్య కంటి నుండి ఏకధారగావర్షిస్తున్నాయి కన్నీళ్లు!

అతడు నోటివద్ద ఉంచుకోబోయిన గ్లాసును ఆమెవైపు క్రూరంగాచూసి ఆమె ముఖంమీదికి విసిరేడు. అది ఆమె ముఖా నికి బలంగాతగిలి నేలమీద పెద్దశబ్దంతో పడి భళ్ళున బ్రద్దలయింది!

"నాకు నీతులు చెప్పకు! నువ్వూ, పిల్లలూ కట్టకట్టుకుని గోదాట్లో దిగండి! నేను మాత్రం తాగుడు మానను గాక మానను. అర్థమయిందా? నీమూలాన కొత్తగళాసు పగిలిపోయింది. మరోటి పట్రా!" ముద్దగా సాగదీస్తూ అన్నాడు.

భార్య అక్కడనుండి కదల్లేదు, ఏడుస్తు నిలబడిపోయింది.

"నీకే! తీసుకురమ్మంటే వినపడటం లేదా? అహ!...వినపట్టంలేదా అని..." అంటూ కుర్చీలోంచి తూలుతూ లేచివచ్చి భార్య వీపుమీద గట్టిగా రెండు చరుపులు చరిచేడు.

నోటిలో చీరకొంగుకుక్కుకుని ఏడు స్తూనేలమీద కూలబడిపోయింది భార్య.

గోడ ఆసరాగా మెల్లగా తడుము కుంటూ వంటగదిలోకివెళ్ళి మరోగ్లాసు తెచ్చుకున్నాడు అతను.

సీసాలోని ద్రవం గ్లాసులోకి, గ్లాసు లోనుండి అతడి పెదవులమధ్యకు వెళ్ళి పోయింది.

భర్త అరుపులూ, భార్యరోదనలూ పిల్లలిద్దరూ లేచిపోయారు.

భయంగా అడుగువేసుకుంటూ గది తలుపుదగ్గరే ఆగిపోయి ఏడుస్తున్న తల్లి వంక నిస్సహాయంగా చూస్తూ నిలబడి పోయారు!

నేలమీద పడివున్న భార్య కదలలేక మూలుగుతోంది!

ఇంతలో అయిదునిమిషాలు గడవకుం డానే మరోగ్లాసు ద్రవం భర్త పెదాల మధ్య ఇంకిపోయింది.

ఆ గదిలో ఒకమూలగా నిలబడి ఈ పరిస్థితినిచూస్తున్న ఆమె తృప్తిగా ఊపిరి పీల్చుకుంది.

ఆమె గుండెనిండా ఆనందం పొంగింది!

ఇంక ఈ యింటిలోవుండి వ్యక్తుల్ని పీడించాల్సిన అవసరం ఆమెకు కని పించలేదు!

సీసాలో ద్రవం వంక, ఖాళీఅయిపో తున్న గ్లాసువంక మార్చిమార్చిచూసి, తృప్తిగా నిట్టూర్చి, రివ్వున బయటకు ఎగిరి వెళ్ళిపోయింది ఆమె!!!

యర్రంశెట్టి శాయి హాస్యమరాలజీ : 11

# పత్రికోపాఖ్యానం



సింహాద్రి హుషారుగా ఈలవేసుకుంటూ నడుస్తున్నాడు. రోడ్డుమీద ఇంకో వంద గజాల్లోనే ఉంది "తెలుగుగాలి" వార పత్రిక ఆఫీస్ తను కథలు రాయటం ప్రారంభించి రెండేళ్ళయిందిగాని ఇదే మొదటిసారి ఓ పత్రిక కార్యాలయానికి రావడం.

గేటు దగ్గర వాచ్‌మన్ అతన్నిచూసి "ఠైరో" అన్నాడు తెలుగులో.

సింహాద్రి ఠైరో అయిపోయాడు.

"కహాఁజానా?" అన్నాడు అతనుమళ్ళీ తెలుగులో.

"ఎడిటరు గారిని కలుసుకోవాలి!"

"సాయంత్రం నాలుగ్గంటికి రా!" అన్నాడీసారి అతను హిందీలో.

"ఇప్పుడు వెళ్ళకూడదా?"

"ఆయనెప్పుడొస్తారో — ఆయనకే తెలీదు—అందుకని...

సరిగ్గా అప్పుడే స్కూటర్‌మీద ఇద్దరు గేట్లోనుంచి లోపలికెళ్ళటం జరిగింది

"యహ్ లక్ష్మీ! ఎడిటర్ సాబ్" అన్నాడు వాచ్‌మన్ చిరునవ్వుతో— తెలుగులో

"మరినేను వెళ్ళవచ్చా?" అనుమానంగా అడిగాడు సింహాద్రి.

"నామ్‌బోలో!" అన్నాడతను మళ్ళీ

"సింహాద్రి"

"కహానీ ఆయా?"

"ఇక్కడే ఈడూరే ప్రస్తుతం!"

అతను ఓ కాగితంమీద వివరాలురాసి ఓముక్క— సింహాద్రి చేతిలో పెట్టాడు.

"ఇంక లోపలికెళ్ళవచ్చు" అన్నాడు హిందీలో.

సింహాద్రి ఇంగ్లీషులో నవ్వి—తెలుగు నడక నడిచాడు లోపలికి.

ఎడిటర్ చుట్టూ పదిమంది మూగి ఉన్నారు.

"ఎలక్ట్రీషియను వొచ్చాడా?"

"రాలేదు సార్!"

"త్వరగా పిలిపించండయ్యా! ఈ ఫాన్ తిరగటంలేదు. ఛస్తున్నాను"

"సార్! ఇక్కడ ఈ వారంలో కథ చివర కొంచెం ఖాళీ వచ్చింది! ఏం చేద్దామంటారు?" ఫోర్‌మన్ కాబోలు అడుగుతున్నాడు.

"అది కూడా అడగాలంటయ్యా! ఒక పక్షి రెక్కలలో పధ్నాలుగు వేల ఈకలుంటాయి మీకు తెలుసా?" అని రాసెయ్యి అక్కడ! మన ఆర్టిస్ట్‌తో చిన్న పక్షిబొమ్మ కూడా వేయించు. సరిపోతుంది!"

ఫోర్‌మన్ అనుమానంగా చూశాడు ఎడిటర్ వంక.

"సార్! పక్షిరెక్కల్లో నిజంగా పధ్నాలుగువేల ఈకలుంటాయా?"

"పిచ్చివాగుడు వాగకయ్యా! ఎవడికి తెలుసు?"

"మరి తెలీందే ఎలా ప్రచురిస్తాం అండీ! ఎవరయినా అది తప్పని గొడవ

చేస్తే!..."

"నువ్వెక్కడ దొరికావయ్యా దేవుడా. పక్షిరెక్కలో ఎన్ని ఈకలుంటాయో ఎవడికి తెలుసు?"

"మామూలు పాఠకులకయితే తెలీదు గానండీ, జూఆలజీ బర్డ్సుఆలజీ, చదివిన వాళ్ళకు తెలుస్తుంది గదండీ!"

"తెలుస్తే మనకేం? ప్రాక్టికల్‌గా ఓ పక్షిని తెచ్చి ఈకలు లెక్కపెట్టి చూపించమంటాం!"

"ఒకవేళ లెక్కపెట్టి—మన సంఖ్య తప్పని ఋజువు చేస్తే?"

"అబ్బా—నిన్ను ఫోర్మాన్‌గా పెట్టుకుని నేనెలా పన్జేస్తున్నానో నాకేతెలీటం లేదు. ఒకవేళ అలాజరిగితే ఇంకో సంచికలో మళ్ళీ ఓకధ కింద ఖాళీవచ్చిన చోట "ఫలానా సంచికలో పక్షిరెక్కకు 14వేల ఈకలుంటాయని ప్రచురించాం! అది తప్పు! కేవలం పదమూడువేల తొమ్మిది పందల సలభై ఆరేనని ప్రఖ్యాత బర్డ్సుఆలజిస్ట్ ప్రొఫెసర్ శ్రీ పక్షేశ్వర రావుగారు తెలియచేస్తున్నారు."

అని ప్రచురిచ్చేస్తాం! ఇంకనువ్వెళ్తే నాపని చూసుకుంటాను" అతను వెళ్ళిపోయాడు.

"గురుజీ" అన్నాడు ఇంకోవ్యక్తి

"ఏమిటి నాయనా?"

"ఈ సంచికలో వ్యాపారప్రకటనలు ఇంకో అయిదు పేజీలు ఎక్కువ వచ్చాయ్"

"అలావచ్చేస్తే ఎలాగయ్యా! ఇప్పటికే రెండు సీరియల్స్— రెండు కధలు మాత్రం ఇస్తున్నాం పాఠకులకి! ఇంకేం తగ్గించమంటావ్?"

"ఒకసీరియల్ ఎత్తిపారేయండిసార్! మన పత్రిక నడుపుతోంది వ్యాపార ప్రకటనలకోసంగానీ.పాఠకులమీద ప్రేమ కోసం కాదుగదా!" నవ్వుతూ అన్నాడతను.

"ఆసంగతి నిజమేననుకో! అయినా అలాగన్జెప్పి—అయినా అలాసడెన్‌గా సీరియల్ ప్రచురించకపోతే జనంగొడవ చేయరూ?"

"అలా కొత్తగా మాట్లాడతారేమిటి సార్! అప్పుడప్పుడు ఇలా వ్యాపార ప్రకటనలు ఎక్కువయినప్పుడుసీరియల్ ఎత్తిపారేసి

"ఫలానాసీరియల్— రచయితనుంచి సకాలంలో అందకపోవటం మూలాన ఈ వారం ప్రచురించలేకపోతున్నాం! వచ్చే వారం నుంచీ యధాప్రకారం ప్రచురిస్తాం!" అని ఓ ఎడిటర్స్ నోట్‌పడేసే వాళ్లంగదా! మర్చిపోయాననుకుంటున్నారేమిటి?" ఎడిటర్ చిరాకుపడ్డాడు.

"సరేలేవయ్యా! వెళ్ళు అలాగే కాని! ప్రతాడూ ఎడిటరే—నీయప్పు! ఈ పత్రికలో!"

అతడు నవ్వుకుంటూలేచి "థాంక్యూ సర్" అనేసి వెళ్ళిపోయాడు.

అతనితోపాటు మరో యిద్దరుకూడా వెళ్ళిపోయారు.




ఈలోగా ఓపక్క సిల్కులాల్చీ వేసుకొని హడావుడిగా ఆ గదిలోకి జొరబడ్డాడు.

ఎడిటర్ అదిరిపడిలేచి నిలబడ్డాడు.

"నమస్కారంసార్!"

"సూడు ఎడిట్రూ! మా బామ్మర్ది ఎలక్షన్లో నిలబడ్డాడు నీకు తెలుసుగదా!"

"ఆయ్ తెలుసండీ! మన ప్రెస్‌లోనే పోష్టర్స్ కూడా కొట్టించాంకదా!"

"ఇప్పుడు తెగడబ్బు కరుసయిపోతూండాది. కనుక మనపత్రికల తాలూకు డబ్బుకూడా కావాల!"

"అలాగే సార్ !"

"కిందటినెల కతలూ, నవలలపోటీ పెట్టాంకదా! ఏవయిందది!"

"బహుమతిపొందినకథలూ, నవలలూ అన్నీ మీమరదలుగారు సెలక్ట్‌చేశారుగదండీ! వచ్చేవారం ఎనౌన్స్‌చేస్తున్నాం!"

"బహుమతుల మొత్తం ఎంత?"

"ఇరవై వేలండీ!"

"అయితే ఆ పోటీ ఎత్తిపారేయ్—ఇప్పుడు డబ్బులేదు. ఎలక్షన్లకికావాలి!"

"కానీ మరిపోటీ..."

"ఓర్నియవ్వ! ఇందులో కొత్తేవుందయ్యా! బవుమతికితగ్గ కతలూ, నవలలూ రాలేదు—అంచేత పోటీ ఎత్తేశాం అని రాసెయ్! అందరూచేసేదేగాఇది!"

"అలాగేనండీ!"

"ఇంకేవయినా డౌట్లున్నాయా?"

"ఇంకేం లేవండీ!"

అతనువెళ్ళిపోయాడు. ఎడిటర్ కూర్చుని "హమ్మ" అనుకుంటూంటగా ఇదే సమయమని సింహాద్రి తక్కినలోపలకు జొరబడ్డాడు.

"నమస్కారమండి!"

"నమస్కారం బాబూ!"

"నా పేరు సింహాద్రిఅండీ!"

"ఓహో ఎలక్ట్రిషియనా? చూడు బాబూ! ఈ ఫాన్ రెండ్రోజుల్నుంచీ తిరగటంలేదు! చెమటతో ఛస్తున్నాననుకో! రిపేర్ లాగించెయ్ — నీకు పుణ్యం వుంటుంది!"

సింహాద్రి ఖంగారుపడ్డాడు.

"అబ్బే—నేను ఎలక్ట్రిషియన్‌కాదండీ! రచయితని! రచయిత సింహాద్రి!"

"రచయితవా?" నిరుత్సాహంగా అన్నాడతను.

"అవునండీ!"

"ఎలక్ట్రిషియన్‌వికాదా?"

"కానండీ!"

"పోనీ ఎలక్ట్రిషియన్‌వి కాపోయినా, నీకు ఫాన్‌లు రిపేర్ చేయడంపచ్చా?"

"రాదండీ!"

"ఎందుకని?"

"నేర్చుకోలేదండీ!"

"ఛ!ఛ! ఏం రచయితలండీ మీరు! ఫాన్‌రిపేర్ చేయడం రాకపోతేఎలా? ఇప్పుడు చూడండి! ఎంతకష్టమయిపోతోందో! ఉఫ్ఫ్—"

"అవునండీపాపం! చాలా కష్టమయిపోతోంది..."

"ఫాన్‌రిపేర్, ఇస్త్రిపెట్టి రిపేర్—ఇలాంటివి—రచయితలన్నాక నేర్చుకోవాలండీ!"

"అ...అ...అవునండీ!"

"సడెన్‌గా ఏదో కథలో హీరోయిన్ వాళ్ళ ఫాన్ చెడిపోయిందనుకోండీ! అప్పుడు ఎలా రిపేర్ అయిందో రాయాలంటే మీకూ రిపేరింగ్ తెలిసి ఉండాలికదా?"

"అఫ్‌కోర్స్—నిజమేనండీ! నే నటు సైడ్‌నుంచీ ఆలోచించలేదు—"

"ఇంతకూ మీరేం రాస్తూంటారు? ఎక్కువ సెక్స్ రాస్తారా?"

అడిగాడతను అనుమానంగా.

"అబ్బే—నేను సెక్స్‌రాయనండీ!"

"పోనీ మర్డర్లు — అంటే క్రైమ్ రాస్తారా? సస్పెన్స్‌రాస్తావా?"

"అబ్బే! అదికూడా రాయనండీ! ప్లెయిన్ సొషల్‌స్టోరీస్—"

"అయితే ఇక వెళ్ళండి!"

"వెళ్ళిపోవాలా? అదేమిటండీ?"

"అవునయ్యా! సెక్స్, క్రైమ్, సస్పెన్స్, బ్లాక్‌మాజిక్— ఇలాంటివేమీ లేని రచనలు మాకక్కర్లేదు— త్వరగా వెళ్ళండి బాబూ! అసలే ఓ పక్కన చెమటతో ఛస్తున్నాను— అన్నట్లు మీకు ఫాన్ రిపేర్ కూడా రాదుగదూ?"

"రాదండీ"

"సిగ్గుండాలండీ ఆమాట చెప్పడానికి! ఏమీరాకుండా ఏమిరాస్తారండీ మీరు?"




"అదికాద్సార్! నా నవల ఒకటి మీరు చదివి..."

"వద్దు బాబూవద్దు! ఇప్పటికే చదవాల్సిన నవలలు 116వ–ఎనిమిదేళ్ళ నుంచీ అలాపడి వున్నాయ్. టైములేదు! ఉఫ్ఫ్ఫ్— ఈ ఎలక్ట్రిషియన్ ఎప్పుడొస్తాడో ఏమో!"

"చూడండి ఎడిటరుగారూ! మీ పత్రికంటే నాకెంతో అభిమానమండీ! అందుకనే నవల కష్టపడి రాసి"

"నమస్కారమండీ!" అంది కమ్మని గొంతు.

ఎడిటరు మొఖం స్విచ్ వేసిన బల్బులా వెలిగింది.

"ఆ-నమస్కారమండీ! రండి! కూర్చోండి!"

ఆ అందమైన స్త్రీ ఆకారం వచ్చి సింహాద్రి పక్కనే కుర్చీలో కూర్చుంది.

"నేను రచయిత్రి కైకేయి నండీ!"

"అబ్బబ్బబ్బబ్బబ్బ! నమస్కారమండీ బాబూ నమస్కారం! రచయిత్రి కైకేయి మీరా? ఎంతకాలానికి ఆఫీస్ కొచ్చారు!"

"కొన్ని గేయాలు రాసుకొచ్చానండీ! చాలా బావుంటాయ్! చీమలగురించిఅన్నమాట! నిజంగానండీ పాపం మీకు తెలుసో తెలీదో- చీమలకున్నంత సంస్కారం, సివిలైజేషన్- మనుషులకు లేదండీ! ఉదాహరణకు చీమల్లో కూడా ఎలక్షన్లు ఉంటాయన్న మాటండీ పాపం ఆ ఎలక్షన్లలో"

ఎడిటర్ కేం చేయాలో తోచలేదు.

"ఉఫ్ఫ్ఫ్ఫ్ఫ్!" అంటూ అర చాడు కోపంగా

"ఏమిటండీ అలా అరిచారు పాపం" ఆశ్చర్యంగా అడిగింది కైకేయి

"ఫానండీ! ఫాన్ చెడిపోయింది! అసలే ఉక్కపోసి ఛస్తున్నాను;అన్నట్లు మేము గేయాలు ప్రచురించటం మానేశామండీ!"

"అయ్యో! ఎందుకనండీ? పాపం?"

"గేయాలు ప్రచురించడం చాలా పాపం! అంచేత వద్దని ఉత్తరాలు రాస్తున్నారండీ పాఠకులు–అందుకని..."

"గేయరచయిత్రులకు ఇలాగయితే ఇబ్బందేనండీ పాపం!"

"అయినా మీరు నవలలు రాయక గేయాలు ఎందు కొచ్చిందండీ?"

"అయ్యో! రాయలేదని ఎవరన్నారండీ పాపం! గేయాల సంగతి తేల్చుకున్నాకే నవలలు సంగతి మాట్లాడొచ్చని ఊరుకున్నానండీ!"

అంటూ లేచి గడపవరకూ వెళ్ళి "రాసులూ! ఇలా తీసుకురా!"అందామె

మరుక్షణం ఓ లావుపాటి వ్యక్తి భుజం మీద ఓ పెద్ద బస్తాలాంటి మూటతో లోపలి కొచ్చాడు.

"ఆనవలల్ని టివ్వు! అందామె.

అతను చకచక బస్తావిప్పి లోపల్నుంచీ బాగాలావుపాటి నవలలు తిసి టేబుల్ మీదుంచాడు.

'ఏమిటండీ ఇవి?" కారిపోతున్న చెమటలు తుడుచుకుంటూ అడిగాడు ఎడిటర్.

"నవలలండీ! రెండు నవలలూ రాయడానికి రెండేళ్ళు పట్టిందండీ! రెండూ కూడా- అప్పుడే ఇద్దరు ప్రొడ్యూసర్లు కొనేశారన్న మాటండీ!

రెండింట్లోనూ ఎన్టీరామారావుగారు హీరోగా వేస్తేనే బాగుంటుందని నా అభిప్రాయం; నిర్మాతల అభిప్రాయమూ నండీ! కానీ మరిప్పుడు రామారావుగారు సినిమాల్లో వేయరట గదండీ! అందుకని ఈలోగా ఏదయినా పత్రికలో సీరియల్‌గా వేయించమని నిర్మాతగారు చెప్పారండీ!.

"ఉఫ్ఫ్ఫ్ఫ్" అంటూ అరిచాడు ఎడిటరు.

"ఏమిటండీ అన్నారు?"

"ఫానండీ! చెడిపోయి రెండు రోజులయింది! ఎలక్ట్రిషియన్ రాలేదు. అన్నట్లు మీకు ఫాన్ రిపేర్ చేయడం వచ్చా?"

ఆమె నవ్వింది.

"ఒకసారి చేశానండీ! కానీ ఆతరువాత ఎంతమంది ఎలక్ట్రిషియన్లను పిలిపించినా అస్సలు తిరగలేదది! అప్పటి నుంచీ మావారు ఏ వస్తువూ రిపేర్ చేయవద్దన్నారండీ!"

"అలాగా! మీవారంటే నాకెంతో గౌరవం కలుగుతోంది!. ఇంతకూ మీ నవలల్లో సబ్జెక్ట్ ఏమిటండీ?"

నవంబరు 14 బాలల దినం.




# పరుగెత్తే కాలం

బాల్యం చిటికెలో అయిపోతుంది. స్మృతులు మిగిలిపోతాయి, మైలురాళ్ళలా. మొట్టమొదటి తప్పటడుగు, ముద్దుమాట. స్కూలుకెళ్ళిన మొదటిరోజు-తడబడుతూ, పరుగెత్తుతూ. సంఘటనలు-అనుకునేలోగా అయిపోవటం. ఎన్నాయిక బాధలు, బాధ్యతలు. స్వతంత్ర జీవితపు బరువు బాధ్యతలు. రాబోయే జీవిత సంగ్రామానికి సంసిద్ధం కావటానికి బాల్యం ఇచ్చే అవకాశం, సమయం ఎంత పరిమితం?

మీ సంతానానికి మీరివ్వగలిగినంత రక్షణ, ఇవ్వండిక. మరి జీవిత బీమా దానికి చేదోడు వాదోడుగా పాలు పంచుకునేలా చెయ్యండి. అది, సరిగ్గా ఇమడగల ఒక పాలసీ-మీ బాబు పాలిట సురక్షితమైన పునాది అవుతుందిక. జీవితపు రహదారిపైన పయనం సుగమం అవుతుందిక.

ఉచితం!

6 రంగురంగుల వన్యమృగాల స్టిక్కర్లు!

మీరు పొందదలచినట్లయితే ఈ కూపన్‌ని వీరికి పంపించండి:
మేనేజర్ (పబ్లిసిటీ & పబ్లిక్ రిలేషన్స్), ఎల్‌ఐసి ఆఫ్ ఇండియా,
పి. బి. బాక్స్ 5991, బొంబాయి 400 021.

పేరు ______________________

అడ్రసు ______________________

______________________ పిన్ __________

మీరు ఏ పత్రిక నుంచి ఈ కూపన్‌ని తీసుకున్నారు ______________







త్వరపడండి! సరుకు ఉన్నంతవరకే ఈ కానుక. మీ పేరూ, అడ్రసూ ఇంగ్లీషులో రాయండి.

**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

daCunha:LIC/146/83/TL

"ఫామిలీ సెంటిమెంట్స్ అండీ!"

"అంటే బాగా సెక్స్ రాస్తారా?"

"అయ్యో! తెగరాస్తానండీ! ఎనిమిది రేప్‌లూ; నాలుగు పర్వర్షన్స్—"

"అలాగా! మరి క్రైమ్ రాస్తారా?"

"నవల్లో ఆఖరివంద పేజీలూ క్రైమే నండీ! పధ్నాలుగుమంది హత్యచేయ బడతారు-"

"అయితే సారీ మేడమ్! మేము ఇలాంటి నవలలు ప్రచురించటంలేదు. కేవలం సాదా ప్రేమకథలు మాత్రమే ప్రచురిస్తున్నాం!"

"అయ్యో! ఎందుకనండీ పాపం?"

"ఏమోనండీ! మా పాలసీ అది!"

"మంచిపాలసీ కాదండీ పాపంమీది! మీ పత్రిక సర్క్యులేషన్ దెబ్బకు పడి పోతుంది! చూస్తూండండి పాపం!"

"చూస్తూంటానండీ పాపం -ఇంక మీరు..."

"వస్తానండీ పాపం! రాములూ-నవ లలు కట్టకట్టెయ్-వేరే పత్రిక్కి వెళ్దాం!"

ఇద్దరూ లేచి వెళ్ళిపోయాకగానీ సింహాద్రి కోలుకోలేదు.

"సార్! సాదాప్రేమ కథలు వేస్తా నని ఆమెతో అన్నారుకదూ?"

"మీ రెవరు?" ఎవరో కొత్త వ్యక్తిని చూచినట్లు చూచాడు ఎడిటరు.

"నేను రచయిత సింహాద్రినండీ!"

"మిమ్మల్ని ఇంతకుముందెన్నడో చూసినట్లుంది!"

"అవునండీ! చూసేవుంటారు!"

"ఎక్కడా?"

"ఇక్కడేనండీ! గంటసేపట్నుంచీ నేనిక్కడే ఉన్నాను."

"అలాగా! చాలాసంతోషం! ఈ ఫాన్ ఒకటి చెడిపోయి చచ్చింది! నానా అవ స్థగా ఉందనుకోండి!..."

ఫోర్‌మన్ మళ్ళీ హడావుడిగా తయారవుతున్న ఫారాలు పట్టుకొచ్చాడు.

"సార్ - మాసపత్రికఫారంలో ఈ కథదగ్గర ఒకకాలమ్ ఖాళీవచ్చిందండీ! ఏం వేద్దామంటారక్కడ?"

"మన ఎలక్ట్రిషియన్ ఫొటోవేసి 'కనిపించడంలేదు' అని వేయండయ్యా రెండ్రోజుల్నుంచీ ఛస్తున్నాను-ఎవ్వడూ పట్టించుకోడు"

"త్వరగా చెప్పండిసార్! ప్రింటింగ్ ఆగిపోయింది!"

"ఏమయినా జోక్స్ వేయవయ్యా!"

"లేవండీ! అయిపోయాయ్"

"మన పాతపుస్తకాల్లోంచితీసి మళ్ళీ వేయండి!"

"పాతపుస్తకాల్లోవే ఇప్పటికి ఆరు సార్లు వేశామండీ ఒకోజోకూ!"

"అయితే రచయిత[్రు]లకు మనవి వేసేయండీ!"

"మేటర్ ఏంవేయమంటారు?"

"పాతదేనయ్యా! కథ ఇన్ని పేజీలకు మించకూడదు, సొంతకథ అన్న హామీ ఉండాలి. స్టాంపులు జతపరచాలి. రెండే




ళ్లవరకూ కథలగురించి ఉత్తరప్రత్యుత్తరాలు జరుపకూడదు. ఒకవేళ ఈలోగా రచయిత చనిపోతే అతనికథ అతనికి పంపబడుతుంది-ఇలా ఒకటి తయారు చేశాంకదా ఆ మధ్య?"

"సరేనండి!"

అతను వెళ్ళగానే ఎడిటరు సింహాద్రి వంక చూసాడు.

"మీరు ఎవరో చెప్పలేదు"

"నేను రచయిత సింహాద్రినండీ!"

"ఓ అలాగా! చాలా సంతోషం! అన్నట్లు మీకు ఫాన్ రిపేరు చేయడం వచ్చా?"

"రాదండీ"

"అయ్యో! వచ్చనుకున్నానే-"

ఇంకో కుర్రాడు పరుగుతో వార పత్రిక ఫారాలు పట్టుకొచ్చాడు.

"సార్! ఈ ఫారంలో ఇక్కడ చిన్న ఖాళీవచ్చింది! ఏంచేయమంటారు?"

"ఏదయినా గేయం వేసేయండి."

"ఒకటే గేయం ఉందిసార్! అదేమో బాగా పొడుగెక్కువుంది!

"సగం నరికేయండయ్యా బాబూ! అదికూడా చెప్పాలా?"

ఆ కుర్రాడు వెళ్ళిపోగానే ఇంకోతను వచ్చాడు.

"సార్ ఈసీరియల్ ఈ పేజిల్లో చాలటం లేదండీ!"

"ఎన్ని లైన్లు ఎక్కువొస్తోంది?"

"ఇరవై లైన్లు ఎక్కువొస్తోంది!"

"నవల మధ్యలో ఓపేరా ఎత్తేయండయ్యా, సరిపోతుంది- ఇలాంటి చిన్న చిన్న విషయాలు - కూడా నాకే వచ్చి చెప్పాలా?"

"ఏమోసార్! ఏదయినా ముఖ్యమైన పేరా తీసేస్తే పాఠకులు గొడవ చేస్తారేమోనని-"

"నాతలకాయ్ గొడవచేస్తారు! కిందటేడు ఆరచయిత్రిగారి నవలలో అరవై పేజీలు ఎక్కడో పోయినయ్ గుర్తుందా! అలాగే లాగించేసాం! ఎవరయినాతెలుసుకున్నారా? ఆఖరికి ఆరచయిత్రి కూడా గుర్తుపట్టలేదు!"

ఆకుర్రాడు పరుగుతో వెళ్ళిపోయాడు

సింహాద్రి లేచి మౌనంగా బయటికి వచ్చేశాడు. ఇప్పుడు తను వెళ్ళాల్సింది 'ఆంధ్ర ఘోష' వారపత్రికకు! రిక్షా పిలిచాడతను.

"ఎక్కడికి సార్?"

"ఆంధ్ర ఘోష వారపత్రికకు!"

"ఆ పత్రికకు నేను రానుసార్!"

"అదేమిటి? ఎందుకని?"

"వాళ్ళకూ నాకూ పడదండీ!"

"ఎందుకు?"

"నా కార్టూన్లువేసుకుని పారితోషకం ఎగ్గొట్టారండీ వాళ్ళు!"

సింహాద్రి ఉలిక్కిపడ్డాడు.

"నువ్వు కార్టూన్లు వేస్తావా?"

"ఏం? వేయకూడదా?" కోపంగా అడిగాడతను.

"అహహహ! వేయకూడదని కాదు! నీకు కార్టూన్లు వేయటం వచ్చా?"

"మన పత్రికల్లో కార్టూన్ వేయటానికి పెద్దచిత్రాలు గీయటం వచ్చి ఉండాలేమిటి? ఎనిమిదంకెవేసి, పైన సున్నాలో కళ్ళు ముక్కు లాంటివి పెడితే అది కార్టూనే గదా సార్?"

"అహ...అది నిజవే అనుకో! పోనీ జోక్ అయినా రాయటం రావాలికదా?"

"చూడండిసార్! మీరెప్పుడూ తెలుగు మాగజైన్స్ చూస్తున్న బాపతు కాదనుకుంటాను! మంచి వ్యంగ్యచిత్రం, దానికి తగ్గ కాప్షనూ ఉంటే అదెవడూ తెలుగు పత్రిక్కి పంపరు సార్! పంపినా మన వాళ్ళు తిప్పి పంపించేస్తారు అర్థంకాక! అందుకే నేను కార్టూన్లుగీసే హాబీ మానేశాను సార్!"

"మరిప్పుడు నీ హాబీ ఏమిటి?"

"ఓ తెలుగుపత్రిక ప్రారంభిస్తున్నాను సార్ త్వరలో!"

"నువ్వా?"

"అదేమిటండీ, అన్నిటికీ అట్లా ఉలిక్కి పడతారు? ఏం నేను పత్రిక నడపకూడదా?"

"కానీ నీకు సాహిత్యం అదీ బాగా తెలుసా అని?"

"ఎందుకు సార్ అలా పిచ్చిమాటలు మాట్లాడతారు? తెలుగుపత్రిక పెట్టటానికి సాహిత్యం కావాలా? రెండు సీరియల్సు, రెండు కథలూ, ఓ డాక్టరు - పేషంట్

శీర్షిక, పెళ్ళికిముందు గర్భవతి అవడం తప్పా, ఒప్పా అనే చర్చ రెండుపేజీలు, వంకాయతోటబర్ఫీ అనే వంటకం ఓపేజీ, సైక్లోన్‌లో జరిగిన నష్టంగురించి బాధగా కన్నీళ్ళుకార్చే ఎడిటోరియల్, ఓపేజీడు వారఫలాలూ, ఓ పేజీడు సినిమాలూ, ఓ సైన్స్‌పజిలూ, ఓ దేవుడి క్లోజప్‌ఫోటో దానికింద వ్యాసం—ఇవీ! ఈమాత్రానికి సాహిత్యం తెలియాలా? ఎందుకు సార్ సాహిత్యం తగలేసుకోను? నాకు హరి కథ చెప్తారేమిటి?"

సింహాద్రి ఇంక అక్కడుండటం క్షేమకరం కాదని ముందుకి నడిచి వేరే రిక్షా ఎక్కాడు.

'ఆంధ్ర ఘోష' ఎడిటర్ ఎయిర్ కండిషన్ రూములో కూర్చుని ఉన్నాడు.

"నమస్కారమండీ!"

"నమస్తే-నమస్తే! కూర్చోండి!"

"నాపేరు సింహాద్రి! నేను రచయితను!"

"పారితోషికం కోసం వచ్చారా? కొంచెం ఆలస్యం అయినమాట నిజమే ననుకోండి! కానీ ఇప్పుడే రెండేళ్ళక్రితం ప్రచురితమైన కథలకు పారితోషికం పంపడం ప్రారంభించాం! మీ కథ మా పత్రికలో పబ్లిష్‌అయి ఎన్నేళ్లయింది?"

"అబ్బే! నా రచనలేమీ ఇంతవరకూ మీ పత్రికలో పబ్లిష్ కాలేదండీ!"

"ఆ! లేదా! అయితే మరెందుకొచ్చారు?"



"నేవ్రాసిన నవలొకటి మీకిద్దామని"

"నవల! వెరీగుడ్! ఏం నవలండీ అది? దేనిమీద రాశారు?"

"ప్రేమకథండీ!"

"ట్రాష్..." అరచాడతను!

సింహాద్రి గాబరాపడ్డాడు. "ఏమిటండీ అరిచారు?"

"ట్రాష్ అన్నాను! అలాంటి కథా వస్తువు మా పత్రికలో పనికిరాదండీ! అయినా మీలాంటి యువకులు విప్లవం గురించి రాయాలండీ! మన సంఘంలో జరుగుతున్న ఎక్స్‌ప్లాయ్‌టేషన్‌గురించే రాయాలండీ! రాసి జనాన్ని మేల్కొలపాలి! రెచ్చగొట్టాలి! రక్తం వెల్లువగా ప్రవహింపజేయాలి! ప్రజారాజ్యం రావడానికి శంఖారావం ఊదాలి!"

"సార్!" ప్యూన్‌లో పలికొచ్చాడు.

"ఏమిటి?"

"ఆ చెప్పులు కుట్టేవాడు పేచీపెడుతున్నాడుసార్! నాలుగుచోట్లకుట్టి, కొత్త

లెదర్‌కూడా వేశాడట! రెండు రూపా యిలు ఇమ్మంటున్నాడు"

"వాడికేం పొగరెక్కిందా? మన ఆఫీస్ గేటుబయట పోనీలేగదా అని కూర్చోనిస్తున్నాం! ఇలా పిచ్చివేషాలేస్తే మన ఆఫీస్‌కాంపౌండ్ వాల్‌ని ఆనుకొని కూర్చోడానికి వీల్లేదని చెప్పు!" కోపంగా అన్నాడు ఎడిటర్.

"ఎంతయినా మీరిచ్చేఒక్కరూపాయి చాలా తక్కువసార్! పాపంవాడు గంట సేపు శ్రమపడి కుట్టాడది-" జాలిగా అన్నాడు ప్యూన్.

నీక్కూడా పొగరెక్కినట్లుందే- వెళ్లు! మర్యాదగా అర్ధ రూపాయి తీసుకుని నోర్మూసుకుని కూర్చో మని చెప్పు! లేపోతే ఈ చుట్టుపక్కల కన్పడకుండా గెంటిస్తా?"

ప్యూన్ వెళ్ళిపోయాడు.

"ఆ! మీకు నేనేం చెప్తున్నాను?" సింహాద్రినడిగాడు ఎడిటరు.

"అదేనండీ! మనసంఘంలో బీదాడిని గొప్పోడు ఎలా ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నాడో తెలియజేసే రచనలు చేయాలని చెప్తున్నారు!"

"కరెక్ట్! కష్టపడి; చెమటోడ్చి; రెక్కలు ముక్కలుచేసుకుంటే వాడికి లభించేది ఓపూట అన్నం-కటికనేలమీద నిద్రా; చెట్టుకింద నివాసమూనా? ఏమిటది? ఏమిటీ అన్యాయం? మా పత్రిక పాలసీ ఈ ఎక్స్‌ప్లాయ్‌టేషన్‌ని బయట పెట్టటం! బీదాడికి కాపిటలిస్ట్‌లు చేస్తున్న అన్యాయాన్ని-అందరికీతెలియజేయటం! అందుకే అన్నీ అలాంటి రచనలే వేస్తున్నాం! ఉదాహరణకు ఈ సంచికలో సెంటర్ స్ప్రెడ్‌కథ చూడండి! ఓసారి చదవండి!" అంటూ పత్రిక సింహాద్రికి అందించాడతను.

"సార్!" గడ్డం పెంచుకున్న ఓవ్యక్తి లోపలికొచ్చాడు.

"ఎవరు? ఆర్టిస్ట్ గారా! రండి! కూర్చోండి!"

"నా బొమ్మలకు మరీతక్క మొత్తం ఇచ్చేరేమిటండీ! ఎంతో కష్టపడి వేశానవి!"

"మా రేటు అంతేనండీ! మా పత్రిక పాలసీప్రకారమే రేట్లుంటాయ్-"

"కానీ చిన్నపత్రికలుకూడా మీకంటె ఎక్కువరేట్లు ఇస్తున్నాయికదండీ?"

"అది వాటి పాలసీనాయినా! మేమేం జేస్తాం? ఇష్టమయితేనే మా పత్రిక్కి బొమ్మలువేయండి! లేపోతేలేదు—అన్నట్లు ఇదిగో-నువ్వువేసిన ఈ బొమ్మలో గొప్పోడు-బీదాడిని నేలమీదపడేసితొక్కడం మంచి ఎక్స్‌ప్రెషనేగాని; బీదాడి మొఖంలో ఇంకా దీనత్వం! గొప్పోడి మొఖంలో ఇంకా క్రౌర్యం కనిపించాలి! ఆ ఎఫెక్ట్ గీసుకురా!"

ఆర్టిస్ట్ గొణుక్కుంటూ ఆ బొమ్మ తీసుకుని వెళ్ళిపోయాడు.

"కథ చదివానండీ!" అన్నాడు సింహాద్రి!

"ఏ కథ?"

"అదేనండీ సెంటర్ స్ప్రెడ్! గొప్పోడు ఎ.సిరూమ్‌లో కూర్చుని ఇడ్లీ తింటూంటే- బీదాడు వెళ్ళిపొడిచేసి ఆ ఇడ్లీ తను తింటాడు."

"అదోయ్! అదీ రివల్యూషనంటే! ఇలాంటి కథలే బీదాళ్ళ కళ్ళు తెరిపిస్తాయ్! కర్తవ్యాన్ని బోధిస్తాయ్! నువ్వు కూడా ఇలాంటి కథలే రాయాలి!"

"సరేనండీ!"

టేబుల్ మీదున్న ఫోన్ మోగింది.

"హలో! ప్రొప్రయిటర్‌గారా! సమస్కారమండీ! ఏమిటిసార్! కాపిటలిస్ట్ పార్టీవాళ్ళొస్తే- పాతికవేలు డొనేషన్ ఇమ్మని ఫైనాన్స్ మేనేజర్‌తో చెప్పమంటారా? అలాగేనండీ! చెప్తాను"

"ఇంక వస్తానండీ" లేచి బయటికొచ్చాడు సింహాద్రి.

మళ్ళీ రిక్షాఎక్కి "సరళ" మాసపత్రిక ఆఫీస్ చేరుకున్నాడు.

ఓ చిన్న పెంకుటిల్లది.

ఓ కుర్రాడు గడపదగ్గర కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు.

"ఏయ్‌తంబీ!" పిలిచాడు సింహాద్రి.

"ఏంసార్?" ఉలిక్కిపడిలేస్తూ అడిగాడు.



"ఎడిటరు గారున్నారా?"

"ఎడిటరుగారు లేరుసార్! ఓనరు గారున్నారు!"

సింహాద్రి లోపలకు నడిచాడు.

పెద్దగది! పెద్దటేబులూ! ముందు మరో చిన్న టేబులూ ఓ అరడజను కుర్చీలూ ఉన్నాయ్. పెద్దటేబుల్ వెనుక ఓ లావుపాటి వ్యక్తి కూర్చుని ఉన్నాడు. అతని ముందు మందుసీసా; గ్లాసూ ఉన్నాయ్.

"నమస్కారమండీ! నాపేరుసింహాద్రి; రచయితను!"

"హల్లో హల్లో హల్లో హల్లో హల్లో! రచితషింహాద్రిగారు మీరా- స్వాగతం! రండి! కూర్చోండి!" అన్నాడతను కుర్చీలో నుంచి సగంలేచి.

సింహాద్రి కుర్చీలో కూర్చున్నాడు.

"మందు కొడతారా?" అడిగా డతను.

"వద్దండీ! అలవాటు లేదు!"

"ఏమిటీ? అలవాటు లేదా? మీరేం రచీతలండీ! మందలవాటు లేపోతే కత లేం రాస్తారు మందు కొట్టకుండా రాషిన కతలు జనమేం షదువుతారు?"

"ఎడిటరుగారు లేరాండీ?"

"మా ఇంటికి కూరగాయలుపట్టు కెళ్ళాడు! ఇంకో అరగంటలో వచ్చే స్తాడు. కూర్చోండి!"

"మా పత్రిక ఎలావుంటోంది వెంక టాద్రిగారు?" అడిగాడతను.

"నాపేరు సింహాద్రి అండీ! వెంక టాద్రి కాదు!"

"అయామ్ షారీ! షింహాద్రి గారను కున్నాను! షారీ! ఇంతకూ మా పత్రిక ఎలా ఉంటుందో షెప్పనే లేదు వెంక టాద్రిగారూ!" సింహాద్రికి చిరాకేసు కొచ్చింది.

"నా పేరు సింహాద్రండీ! మీ పత్రిక బాగానే ఉంటోంది!"

"బాగానే ఏమిటండీ! అద్భుతంగా ఉంటోంది! కొత్త ఎడిటర్ని ఈ మధ్యనే వేశా! అబ్బాబ్బాబ్బ ఏం తెలివండీవాడికి మా ఇంట్లో పనంతా చిటికెలో షేషే స్తాడు. ఇంటిపనిలోనే కాదుషుమండీ! షాహిత్యంలో కూడా గొప్ప జీనియస్. ఇదిగో పుస్తకాలు షూడండి!" అంటూ టేబుల్ మీదున్న రెండు పుస్తకాలు తీసి చూపించాడు.

ఒకటి విశ్వనాధ సత్యన్నారాయణ పుస్తకం, మరోటి రాచకొండ విశ్వనాధ శాస్త్రి పుస్తకం!

"చూషారా! ఆడు - మా ఎడిటరు- విశ్వనాధ విశ్వనాధశాస్త్రి నుంచీ రాచ కొండ సత్యన్నారాయణ వరకూ-ఊహూ! షారీ! మెలికపడింది! రాషకొండ సత్యన్నారాయణ నుంచీ-ఊహూ! షారీ! మళ్ళీ మెలికపడింది! విశ్వకొండ సత్యన్నారా యణశాస్త్రి నుంచీ రాచనాధ విష్యే— ఊహూ! షారీ! మళ్ళీ మెలికపడింది! రాషనాధ విశ్వన్నారాయణ నుంషీ విష్య కొండ షత్యన్నాధషాస్త్రి—ఊహూ! మళ్ళీ మెలికపడింది. విష్యరాష షత్యన్నారా యణ షాస్త్రి నుంషీ-ఊహూ! రాషినాధ విశ్వషాస్త్రి—"

"నాకర్థమయిందిలెండి!" అన్నాడు సింహాద్రి చప్పున అందుకుని.

"అయిందా? చాలా థాంక్స్- వెంక టాద్రిగారూ! యూ ఆర్ ఎ గ్రేట్ రైటర్! ఒండర్‌ఫుల్ అండర్‌స్టాండింగ్ పవర్ అండ్ అండ్ అండ్ అండ్ ది ఎండ్! అహ్హ హ్హ హ్హా!"

"నాపేరు సింహాద్రి అండీ! వెంక టాద్రి కాదు!"

"ఓ! అయామ్ షారీ! షింహాద్రి

అనుకున్నాను! బైదిబై మీ రచనలు మా పత్రికకు పంపటం లేదెందుకని శోభనాద్రిగారూ?"

"నేను ఓ నవల తీసుకొచ్చానండీ! మీకు నచ్చితే..."

"నవల్రాశారా? వెరీగుడ్! కథేంటి?"

"హీరో హీరోయినూ కలిసి చదువుకుంటూంటారండీ! సడెన్‌గా—"

"వివరాలొద్దు సార్! ఒక్క వాక్యంలో కథ చెప్పండి! క్లుప్తంగా! షార్ట్‌గా! ఒన్‌లైన్‌లో—"

సింహాద్రి ఓ క్షణం ఆలోచించాడు.

"ఆ! హీరో హీరోయినూ ప్రేమించుకుని, ద్వేషించుకుని ప్రేమించుకుంటారండీ!"

"వండర్‌ఫుల్! సూపర్బ్! మార్వలెస్! ఈ నవల మేము సీరియల్‌గా వేస్తాం! ఓకే?"

"ఓకేఅండీ! ఇదిగో నవల!"

అతను నవల తీసుకుంటూ తక్కుర దానిని టేబుల్‌మీద పడేశాడు. మళ్ళీ! ఓ కుర్రాడు పరుగుతో వచ్చాడు లోపలకు.

"సార్! రచయితగారు ఈ నెల సీరియల్ ఇవ్వను పొమ్మన్నారండీ!"

"ఎందుకని?"

"మందుకొట్టేసి రోడ్డుమీద పడిపోతే పోలీసులు పట్టుకెళ్ళారండి! జైల్లో రాయటం కుదరదంట!" అన్నాడు.

"తాగుబోతు వెధవ! ఈ రచయితలను కాల్చిపారెయ్యాలి!...

ఇర్రెస్పాన్సిబుల్ ఫూల్స్! ఇదిగో చూడు మిస్టర్! నీకు యర్రంశెట్టిశాయి అనే రైటర్ తెలుసా?"




"తెలుసండీ! కామెడీ రాస్తాడు!"

"ఏడిశాడు! మా ఇంట్లో వంటవాడు అంతకంటె మంచి కామెడీ రాస్తాడు! ఆ రైటర్ ఏం చేశాడో తెలుసా?"

"తెలీదండీ!"

"వాడికథ ఆఖర్లో మార్చామని లాయర్‌నోటీస్ ఇచ్చాడు మాకు!"

"అలాగాండీ?"

"అవును! వాడి అంతు నేను తేలుస్తాలే! అది తరువాత సంగతి! అంచేత నువ్వో కాయితం రాసివ్వు!" అంటూ డ్రాయర్ నుండి ఓ కాగితం పెన్నూ బయటకు తీసి సింహాద్రి ముందుంచాడు.

"ఏమని రాయమంటారు?"

"నా నవలను మీ ఇష్టంవచ్చినట్లు మార్చే అధికారం మీకుంది! అని రాసివ్వు!"

"కానీ అలామార్చేస్తే కథ దెబ్బ తింటుంది కదండీ!"

"మిష్టర్ శోభనాద్రీ!"

"నా పేరు శోభనాద్రికాదండీ! సింహా'

"ఈ నవల తీసుకుని బయటకుపో!"

"ఎందుకనండీ!"

"ప్లీజ్ గెటౌట్–"

"అదికాదండీ!"

"వెళ్తా వాలేదా?"

సింహాద్రి నవల తీసుకుని బయటి కొచ్చేశాడు. అతనికి చాలా అశాంతిగా ఉంది.

ఎదు గ్గాఉన్న రిక్షాని పిలిచాడు.

"అరె! మీరేనాసార్ మళ్ళీ!" అన్నాడు రిక్షావాడు.

అతన్ని గుర్తించాడు సింహాద్రి!. కాబోయే పత్రికాధిపతి.

"ఎందుకుసార్ పత్రికాఫీసులన్నీ తిరుగుతున్నారు ?" అడిగాడతను.

"నవల రాశానుగురూ ! ప్రచురణ కోసం..."

"భలేవారండీమీరు! మరి పొద్దున్న చెప్పలేదే–రచయిత అన్న సంగతి ! నవలరాసినా; కథలురాసినా–వాటిని పత్రి కలకుపంపే ప్రొసీజర్స్ ఉంటాయండీ! దానిప్రకారమే పంపాలని! అంతేగాని పత్రికల ఆఫీసులు తిరుగుతే ఎలా?"

"ఎక్కడుంటాయ్ ఆ ప్రొసీజర్స్?" అడిగాడు సింహాద్రి.

"ఈ పక్కనే రచయితల అసోసి యేషన్ ఆఫీసుందండీ! అందులో దొరుకుతాయ్–పదండి! తీసుకెళతాను" అంటూ అతనిని తీసుకెళ్ళి ఆ ఆఫీస్ ముందు దింపాడు.

ఆఫీస్‌లో గాలా హడావుడిగా ఉంది. లోపల రచయితలు టేబుల్స్‌ముందు కూర్చుని స్పీడుగా రాసేస్తున్నారు.

గోడకు ఓ పేద్ద ఛార్ట్ తగిలించిఉంది. దానిదగ్గరకెళ్ళి చూశాడు సింహాద్రి.

"తెలుగు గాలి— హెరాల్డ్ రాబిన్స్‌కి అనువాదాల్లాంటి రచనలే ప్రచురించ బడును."

"ఆంధ్ర ఘోష – కేవలం గొప్పోడు బీదోడిని చీల్చిచెండాడే కథావస్తువుగల రచనలయితేనే స్వీకరింపబడతాయ్"

"ఊచకోత"—ఫిఫ్టీ-ఫిఫ్టీ పద్ధతిలో నవలలు, పోటీకథలు ఎన్నిక చేయ బడును! ఇంగ్లీషు రచయితలెవరిని కాపీ కొట్టినా ఫరవాలేదు."

"సరళ- ప్రేమకథలూ, నవలలూ తేలికగా ప్రచురణ జరుగును!"

"శక్తి- కేవలం కాపీకథలే ప్రచు రింపబడును!"

"రక్తి-ఏకథయినా నవలయినా ఆడ పేరుతో పంపితే తక్షణం ప్రచురిత మగును!"

"మెరుపు-కేవలం సెక్స్ మోతాదు మించిన కథలే ప్రచురింపబడును."

"ఆంధ్ర క్షమ — పాములూ, దెయ్యాలూ, దేవతలూ - కథావస్తువుగా ఉన్న రచనలు మాత్రమే అంగీకరింప బడును!"

సింహాద్రి ఇలా లాభంలేదని తన డయిరీతీసి చకచకా చార్ట్‌ని కాపీ చేసుకో సాగాడు.

ఆ తరువాత రెండునెలల్లో సింహాద్రి పేరు తెలుగుపత్రిక లన్నిటిలోనూ మార్మోగిపోయింది. *

# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్



కేవలం
**కాంప్లాన్®**
**లోనే వాళ్ళకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి**

పెరిగే పిల్లల పోషణకి, ప్రత్యేకంగా కొన్ని ఆహార పదార్థాలు అవసరమవుతాయి. కాంప్లాన్, వారి పెరిగే వయస్సులో అవసరమయ్యే ఉత్తమమైన ప్రోటీన్లు, దాంతో బాటే మరో 22 కీలకమైన ఆహార పదార్థాలను అందచేస్తుంది గుర్తుంచుకోండి, కాంప్లాన్, డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన ఆహారం.

కాంప్లాన్ రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ-కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది - ప్లెయిన్ (సాదా) గాకూడా




**కాంప్లాన్**
-సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

**ఉచితం!** 32 పేజీల పుస్తకం
"[illegible]"
50 పైసల స్టాంపును జతపరిచి వీరికి వ్రాయండి :
పోస్ట్ బ్యాగ్ నం. 19119 (బాంబే) G/18
బొంబాయి-400 025

GLC-6-1710-TL



# అసలు సంగతి

## సదానంద శారద

(గల్పిక)



"హమ్మయ్య...ఇప్పటికి నీ స్నానం పూర్తయిందా..."

"ఏదో తొందరపడుతున్నావని గబగబా నాలుగు చెంబులు పోసుకొని వచ్చేశాను"

"అరగంటసేపట్నించి నాలుగు చెంబులే, పోసుకున్నావా పీణా...అయిదు నిమిషాలకో చెంబు పోసుకున్నా ఆరు చెంబులవుతాయి..."

ఆఘకాదు పన్నెండు సరేనా...అసలు నేను హాస్టల్లో ఉండేరోజుల్లో ఎంతసేపు స్నానంచేసేదాన్నో తెలుసా?"

"పాపం"

"ఎందుకా జాలి- ఎవరిమీద?"

"మీహాస్టల్లో నీతోవున్న అమ్మాయిల

పట్ల నాసానుభూతిని ప్రకటిస్తున్నాను వీణా...నువ్వు బాత్‌రూంలో దూరి గంటలకొద్దీ తలుపులు బిగించుకుంటే పాపం వాళ్ళెంత ఇబ్బంది పడేవారు"

"అంటే మాహాస్టల్లో ఒకటే బాత్ రూం ఉండేదనా నీఅభిప్రాయం?... వార్డ్‌కు నాలుగుచొప్పున నాలుగు వార్డ్‌లకు పదహారు బాత్‌రూంలు ఉండేవిరాంబాబూ

"ఆర్టీసి బస్సుల సంఖ్యలాగా మీ బాత్రూంల సంఖ్య బాగానేఉంది గాని ఆ పదహారు బాత్రూముల్లో క్లీన్‌గా ఉండి స్నానం చేయాలి అనిపించిన బాత్రూం లెన్ని? క్లీన్‌గా ఉండి స్నానం చేయాలి అనిపించిన బాత్రూముల్లో నల్లాలకు షవర్లకు నీళ్ళొచ్చిన బాత్రూంలెన్ని? నల్లాలకు షవర్లకు నీళ్ళొచ్చిన బాత్రూముల్లో తలుపులున్న బాత్రూములెన్ని? ఇలా లెక్కేసి చూస్తే వార్డ్‌కో మంచి బాత్‌రూం మిగిలుంటుంది- అదేనా ఆ ఒక్కటి కాస్తా నువ్వు గంటకొలద్దీ ఆక్రమించుకునేదానివి...ఏవిటలా చూస్తావ్"

"నీకు పొద్దున అన్నంలో నెయ్యి ఎంత పోశానా అని..."

"అదిగో తలుపులు మూయకు..."

"ఆపప్పులేం ఉడకవు అక్కడనిల్చో

"స్నానం చేయడానికి అరగంట ఆగానా...ఇప్పుడు చీరకట్టుకోడానికి ఎన్ని అరగంటలు కావాలో..."

"నా చీరమీద ఎందుకోయ్ నీకింత



జెలసీ...కావాలంటే ఓసారి కట్టుకోరాదూ

"ఛీ ఛీ..."

"ఎందుకా ఛీ ఛీ... ఆడపిల్లలు పాంట్లు షర్టులు వేసుకోడంలా...నువ్వు చీర కట్టుకుంటే ఏంటోయ్ రాంబాబూ?"

కట్టుకుంటున్నా. నువ్వు తెచ్చిన గీతల లుంగీలు చీరెలు కాకపోతే ఏంటట

"మధ్యాహ్నం సావిత్రి వచ్చింది"

"ఏ సావిత్రి?"

"ఎదురింటి బామ్మగారి పెళ్లికాని కూతురులేదూ..."

"పెళ్ళాన్ని కూతురు అని నువ్వు ప్రత్యేకంగా అనడమేం బాగులేదోయ్"

"బామ్మ అస్తమానం నువ్వు పెళ్ళికాని దానివే కిటికీ తెరవకు, తలుపు తాకకు గాలిపీల్చకు, వెలుగు చూడకు అంటుందట"

"నాకేం అర్థం కావటంలా..."

మధ్యాహ్నం వచ్చి మన తలుపు తట్టింది...ఎవరు? అన్నాను నేను అంది"

"ఎవరు?"

"సావిత్రి"

"ఆఁ..."

"తలుపు తీసే ఉంది—రా లోపలికి అన్నాను. మీ ఆయన ఉన్నాడా? అని అడిగింది ముందు లోపలికిరా అన్నాను మీ ఆయన ఉన్నాడా? అని అడిగింది మళ్ళీ నువ్వొచ్చింది మా ఆయనకోసమా. అని అడిగాను. ఊహుఁ కాదు అంది మరి? అన్నాను.

"మీ ఆయనుంటే మా అమ్మ పోవద్దు అంది- నేను పెళ్ళికాని పిల్లను కదా"

"అంటె ఏవిటో నీకర్థమయిందా ఇలారా అన్నాను-మా సంభాషణ ఇలా జరిగిందోయ్"

"మా అమ్మ అస్తమానం నన్ను పెళ్ళికాని పిల్ల అంటుందక్కా...నాకు ఏడుపొస్తుంది."

"ఎందుకు?"

"అలా అస్తమానం పెళ్ళికానిదానా నీకు పూలెందుకే...మొహం అంతసేపు కడుక్కుంటావా...అంటుంది. చీకటి ఉండి కిటికీ తెరుస్తే...పెళ్ళికానిపిల్లవు అలా కిటికీ ముట్టుకోవచ్చా అని కోప్పడు తుంది..."

"పెళ్ళికానిపిల్ల అన్నం తినొచ్చా అమ్మా అని అడుగకపోయావా..."

"ఎవరితోనూ మాట్లాడనీయదు— వీణతో మాట్లాడకు అంది లతక్కలేమా ఆమెతో మాట్లాడుతుంటే మా అమ్మ నన్ను గబగబా ఇంట్లోకి లాక్కుపోయి వాళ్ళాయన ఇంట్లో ఉం డగానే నువ్వు ఆమెతో మాట్లాడ్తున్నావా అని ఒకసారి కొట్టింది. ఏదో వంకపెట్టి ఎవరినో చూశానని కొట్టని రోజుండదు. లోకం నాకు తెలియదా నేనంత అమా యకురాలినా ...నామీద నాకు జాగ్రత్త ఉండదాఅక్కా...పోనీ ఒంటరిగా ఉన్న ప్పుడైనా తిట్టదు. చుట్టుపక్కలవాళ్ళ ముందు ఎవరినో చూశానని తిడుతుంది. కొడుతుంది. తలెత్తుకోకుండా చేస్తుంది. ఛీ ఏం బతుకక్కా ఇది...ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది..."

"ఛా ఛా ఏడవకు సావిత్రీ. ఆత్మ హత్య మన సమస్యలకు పరిష్కారం కాదమ్మా నువ్వలాపిరికిగా ఆలోచించకు"

"మా అమ్మ గురించి ఇలా మాట్లా డాల్సి వచ్చినందుకు బాధగాఉంది. కాని ఏం చేయను? ఇది నా దురదృష్టం. లోకం కాకులైతే అమ్మ ఒడిలో దాక్కో వచ్చు. కాని అమ్మే కాకై పొడుచుకు తింటుంటె నాకు చోటెక్కడ..."

"స్త్రీకి ఇంటి బయటేకాదు ఇంట్లోనూ శత్రువులున్నారమ్మా. మా నాన్న రాంబాబును మరిచిపొమ్మని తన చెల్లెలి కొడుకును చేసుకొమ్మని ఎంత హింసిం చాడో వింటే నువ్వు ఆశ్చర్యపోతావు..."

# అరణ్యం

పట్టపగలే చిట్టచీకటిగా ఉంటుందా అరణ్యం. అందులోనే జలపాతాలూ, చెరువులు, వాగులూ, వంకలూవున్నాయి. అంతేకాక రకరకాల జంతువులూ, జలచరాలూ, పక్షులూ, పాములూ, పురుగులూ, ఒక్కటేమిటి ఒక్కమానవ జాతి తప్పించి తక్కినవన్నీ నివసిస్తున్నాయి.

అవి ఎప్పటినుంచో చెప్పకోలేని బాధలూ కష్టాలూ అనుభవిస్తున్నాయి. ఎన్నోరకాల చిత్ర హింసలకు కొన్ని వర్గాల ప్రాణులు బలైపోతున్నాయి. అన్ని వర్గాలలోనూ విపరీతమైన అశాంతి ప్రబలిపోయింది. దానికి ముఖ్యమైన కారణం అరణ్యానికి రాజైన సింహం చేస్తున్న ఆగడాలు భరించలేకపోయాయి.

అరణ్యంలో అంతటి చీకటిలోనూ ఎప్పుడు పుట్టుకొచ్చిందో విప్లవం పుట్టుకొచ్చింది. అన్ని వర్గాల ప్రాణులూ సమీకృతమయ్యాయి. గజరాజు అధ్యక్షతన గొప్ప సమావేశం జరిగింది. ఆ రోజు పెద్దపులి చాలా ఆవేశంగా మాట్లాడింది. యెవరి అభిప్రాయాలు వారు నిశితంగానే చెప్పారు. ఎవరు ఎలా చెప్పినా ధ్యేయం, గమ్యం ఒక్కటే.

సింహానికీ విషయం అనుచరులు మోసుకెళ్ళి చెప్పారు. “అనాది నుండి కవులూ, పండితులూ నన్ను మృగరాజని; తమ గ్రంధాలలో అభివర్ణించారు. ఈ పదవి అడవిలో తరతరాలుగా వస్తున్న హక్కు; నేనేకాదు... నా సంతానం, ఆ సంతానానికి సంతానం... ఆ తరువాత తరం, యీ అరణ్యాన్ని యుగాంతం వరకూ పరిపాలించే హక్కు



లు మారుతున్నాయి." అన్నాడు మృగరాజు గర్జిస్తూ ఛాలెంజి చేసాడు. హర్షావేశాలతో చప్పట్లు కొట్టారు అనుచరులు ప్రశంసిస్తూ సింహానికి కొంత బలం వచ్చింది. యీ విషయంలో తాడోపేడో తేల్చుకోవాలన్న నిర్ణయం ఆక్షణంలో జరిగింది. "చేత నైతే దమ్ములుంటే మరొకడ్ని ఎన్ను కోండి అన్న సవాలు మృగరాజు చేసాడు.

"భళీ" అన్నారు భజంత్రీలు.

అంతే! కీకారణ్యంలో ఒకనాటి అభి ప్రాయ సేకరణలాంటి ఎన్నికల సంరంభం ప్రారంభమయింది. కొన్ని గంటల తర్వాత మృగరాజు బలమైన అంచనాలన్నీ తారుమారయ్యాయి. మృగరాజుకు గృహగర్జన, అవమానం రెండే మిగిలి పోయాయి.

పెద్దపులి గెలిచింది పెద్ద మెజారిటీతో. పెద్దపులికి 'పులిరాజు' అన్న బిరుదు ప్రదానం పట్టాభిషేకం జరిగింది. ఏనుగురాజు గారి అధ్యక్షతలో పులిరాజుకు ఘనమైన సన్మానం జరిగింది. అడవిలో సకల ప్రాణులూ సమైక్యంగా గొప్ప ఉత్సవం చేసుకున్నాయి. ఆవుత్సవంలో "అరణ్య జీవనంలో బ్రతుకుతున్న సకల చరాచర ప్రపంచానికీ విధేయుడుగా ఉంటానని జీవన పరిస్థితుల్లో గణనీయమైన మౌలికమైన మార్పులు చేయగలనని" ఆపులిరాజు ఆవేశంగా మాట్లాడడమే కాకుండా అభ్యుదయానికి తాను పునరంకితమౌతున్నానని ప్రతిజ్ఞ చేసాడు- పులిరాజు ముక్త కంఠంతో వినయాంజలి ఘటిస్తూ.

సకల ప్రాణుల హర్షా మోదాలతో అరణ్యం ప్రతి ధ్వనించింది. అలా హర్షం ప్రకటించిన వాళ్ళలో పదవిలేని మృగరాజుని వదలిన అనుచరులనుగూడా పులిరాజు గమనించి గర్వించాడు.

కొన్నిరోజులూ, వారాలూ గడిచాయి. "సింహాసనం ఎక్కడం పాపం కొత్త కదా! అన్నిహంగులూ సమకూర్చుకోవాలి కదా పరిపాలనా కార్యకలాపాల నిర్వహణకు" అనుకున్నాయి అడవిలో ప్రాణులు స్వగతంగా.

నెలలు గడిచాయి. పులిరాజు విజృంభణ ప్రారంభమైంది. తనుపట్టాభిషిక్తుడు కాకపూర్వం, అరణ్యంలో అన్ని వర్గాల ప్రాణులూ అనుభవించిన దుర్భర జీవితానికి కారకులైన వ్యవస్థ మీద చర్య తీసుకోవడం ప్రారంభించాడు. ప్రాణులన్నీ యెంతో హర్షం వెలిబుచ్చుతూ పులిరాజును వేనోళ్ళ కీర్తించాయి.

సంవత్సరాలు గడుస్తున్నాయి. మృగరాజుకీ పులిరాజుకీ మధ్య జరుగుతున్న అంతర్యుద్ధం చల్లారలేదు. యిదికాక వాస్తవ విషయమేమిటంటే ఎక్కడ వేసినగొంగళీ అక్కడేలాగ, అన్నిరకాల ప్రాణుల జీవన విధానంలో మాత్రం మెరుగూ, వెలుగూ ఇంకా కన్పించలేదు అరణ్యంలో...*

**వేమకోటి శీతారామశాస్త్రి**

# ప్రణయ వీచికలు

**మూలం: బార్బరా కార్ట్‌లాండ్**
**స్వేచ్ఛానువాదం: వాసిరెడ్డి సీతాదేవి**

"నిజాం వస్తున్నారా?" సీత తనకు తెలియకుండానే చివ్వున లేచి నిల్చొంది.

"అవును."

"నేనూ విన్నాను- రెసిడెంటుకు కొత్త ప్రధానిని నియమిస్తారటగా?" సర్ హార్వే అడిగాడు.

"అవును సర్."

"నిజాం ఏనుగు మీద వస్తారా?" సీత పసిపిల్లలా కళ్లు మెరిపిస్తూ అడిగింది.

"అవును! ఏనుగు మీదే వస్తారు. ఆయన ఎక్కిన ఏనుగు కాక మరో రెండు ఏనుగులు కూడా వస్తాయి" అనేసి బయటికి వెళ్లి పోయాడు సైన్యాధికారి.

జరిగిన కథ

ఆగంతకుడు ప్రేమికుడు రాజ సమాధుల దగ్గర సీతకి కనిపించాడు- తెలివతి, భారతీయ దృష్టి సీతకి చెప్పాడు. అదృశ్యమయ్యాడు. అతన్ని గురించి ఆమె ఆశ్చర్యానికి అంతంలేదు. బ్లంట్ అభిప్రాయాలకి వ్యతిరేకంగా హార్వే వైస్రాయికి ప్రతిపాదించబోయే బిల్లు భారతీయుల మీద చూపబోయే ప్రమాదం సీతకి పూర్తిగా అర్థం కాలేదు. ఈలోగా రెసిడెన్సీకి నిజాం వస్తున్నాడు.

సీత ఆనందంతో చప్పట్లు కొట్టింది.

సర్ హార్వే ఆమెకేసి చూశాడు.

"బాబాయ్! నాకు నిజాంను చూడాలని ఉంది. ఏనుగుల్ని కూడా. వాటిని చాలా చక్కగా అలంకరిస్తారట గదూ?"

"నీకు సర్దాగానే ఉంది. కాని రెసిడెంటుకు కొత్తగా ఇష్టం లేదు."

"ఎందుకని?" హార్వే ముఖంలోకి కుతూహలంగా చూసింది సీత.

"అబ్బో చాలా పెద్దకథ. నీకు అర్థం ఆయేలా చెప్పడం అంత తేలిక కాదు. రాజకీయ కుతంత్రాల గురించి నీకు ఇప్పుడే అర్థం కాదు. నిజాం బాగా ఆలోచించి మంచివాడిని ప్రధానిగా నియమించాలని కార్జరీ కోరిక, కాని బ్లన్ట్ ఇక్కడ కూడా కుట్ర చేస్తున్నాడు. వైస్‌రాయ్‌ని వల్లో వేసుకొన్నాడు. ఆ పరపతితో ఎందుకూ పనికిరాని ఓ కుర్రకుంకను ప్రధానిగా నియమించాలనే ఆలోచనలో ఉన్నాడు" మిస్టర్ హార్వే తనకు తానే చెప్పు కొంటున్నట్టుగా మంద్రస్థాయిలో అన్నాడు.

సర్ హార్వే డైనింగ్ టేబుల్ ముందు నుంచి లేవాడు. తన గదిలోకి వెళ్ళిపోయాడు.

సీత ఎన్నో అడగాలను కొన్నది. కాని హార్వే ఈ విషయాలు తనతో చర్చించడానికి ఇష్టపడడని ఆమెకు తెలుసు.

తనను మరీ పసిపిల్లలా తేల్చి పారేస్తాడు బాబాయి, చాలా మంది మగవాళ్ళలాగే, ఆడవాళ్ళతో రాజకీయాలు మాట్లాడటానికి అతను ఇష్టపడడు ఆడవాళ్ళు రాజకీయాలు అర్థం చేసుకోలేరని వాళ్ళ నమ్మకం.

సీత నిట్టూర్పు విడిచింది.

కిటికీలో నుండి తోట కన్పిస్తున్నది.

ఆమె మనసులో ఆ అజ్ఞాత నేస్తం మెదిలాడు. అనాయాసంగా ఆమె పెదవులు విచ్చుకొన్నాయి. బుగ్గలు గులాబి రేకలా అయ్యాయి. కళ్ళల్లోకి కొంత వెలుగు తోసుకొని వచ్చింది.

అతడు ఈసారి కన్పిస్తే తన సందేహాలన్నీ అతని ముందు ఉంచాలి. అతను తప్పక సమాధానాలు ఇస్తాడు.

-అలనాటి -చరిత్రలు -ఈనాటి మేటి నవలలు



# శ్రీ ప్రసాద్ రచనలు

(విజయ సీరియల్స్)

| | |
|---|---|
| విజయనగర పతనం-1 | 13·00 |
| విజయ నగర పతనం -2 | 12·00 |
| షాజహాన్ | 13·00 |
| సామ్రాట్ శ్రీరంగరాయ | 10·00 |
| లకుమాదేవి (ఉల్లాదేవి రచన ఆంధ్రభూమి సీరియల్) | 15·00 |
| ఆర్య చాణక్య | 13·50 |
| అప్పాజీ | 12·00 |
| యుగంధర్ | 13·50 |
| రోషనార | 10·00 |



* అన్ని బుక్ షాపుల్లోనూ దొరుకుతాయి. దొరక్కపోతే కోరిన పుస్తకాల విలువలో ఒక రూపాయి తగ్గించి M.O. పంపితే మిగిలిన మొత్తానికి V.P.లు పంపుతాము!




## నవజ్యోతి పబ్లికేషన్స్

ఏలూరురోడ్,
విజయవాడ-520 002.

ఈ రెసిడెన్సీలో రెండు గ్రూపులు ఉన్నాయి తనకు కూడా అర్థం అయింది. తన బాబాయి దృష్టిలో తను ఒక ఫూల్. పసి బిడ్డ. ఇలాంటి విషయాల గురించి ఆలోచించే హక్కు తనకు లేదు.

సీత కింది పెదవిని ముని పంటితో నొక్కింది

పెద్దవాళ్లు-అదే వయసుతో పాటు అనుభవాన్ని జీర్ణించుకొన్న వాళ్ళంతా లార్డ్ రిప్పన్ అభిప్రాయాలతో ఏకీభవించడం లేదని తనకు అర్థం అయింది.

ఇందులో ఏ గ్రూపును తన నేస్తం సమర్థిస్తాడో?

"మేమ్‌సాబ్!"

సీత ఆలోచనల దారం పుటుక్కున తెగింది.

గిర్రున తిరిగి చూసింది.

రెసిడెన్సీలో పని చేసే కుర్రవాడు నిలబడి ఉన్నాడు.

"ఏమిటి"

"మేమ్‌సాబ్! దర్జీ వచ్చాడు. మీరు పిలవమన్నారు గదూ?"

"దర్జీ అంటే- ఆఁ- టైలర్ కదూ?" అన్నది సీత.

ఒకరి భాష ఒకరికి అర్థం కాదు,

పని కుర్రాడు కొన్ని ఇంగ్లీషు పదాలు వల్లించగలడు. వాటికి తోడు సైగలు జోడించి ఆమెకు అర్థం అయేలా చెప్పడానికి ప్రయత్నించాడు.

సీత "అమర్, టైలర్ ఎక్కడున్నాడు?" అన్నది.

అమర్ వెనకే వెళ్ళింది.

అక్కడ టైలర్ మూట విప్పి బట్టలు చూపించాడు.

సీత కళ్లు విప్పారాయి.

తెల్లపట్టు మీద జరీ పువ్వులున్న బట్ట ఆమెను ఆకర్షించింది.

ఒకటి డేడ్రస్, ఒకటి ఈవెనింగ్‌డ్రస్ కుట్టమన్నారని వచ్చేరాని ఇంగ్లీషులో టైలర్ చెప్పాడు.

ఆమె లోపలకు వెళ్ళి తన డే డ్రస్సూ, ఈవెనింగ్‌డ్రెస్సూ తెచ్చిఇచ్చింది. వాటి ఆదలో కుట్టమన్నది,

"ఎవరు పంపించారు?" అడిగింది సీత.




...తో పావ్రగంటు
మరగాలియుండీ!

"నాకు తెలియదు. మరో దర్జీ నాకు ఇచ్చాడు" అన్నాడు దర్జీ

ఆమె దుస్తులు దర్జీ తెచ్చిన బట్టల ముందు వెల వెలా పోతున్నాయి.

"కుట్టు కూలి ఎంతవుతుంది." భయంగా అడిగింది సీత. ఎక్కువైతే తను ఇచ్చుకోలేదని ఆమెకి తెలుసు. మిస్టర్ హార్వేను డబ్బు అడగాలంటే ఆమెకు భయం, డబ్బు విలువను గురించి పెద్ద లెక్చర్ ఇస్తాడు

"మీరివ్వక్కర్లేదు మేడం!" అన్నాడు దర్జీ.

సీత రిలీఫ్‌గా గాలిపీల్చి వదలింది.

దర్జీ వెళ్ళిపోయాడు.

అతనే పంపించి ఉంటాడు. అతని కంటే తన గురించి ఇంతగా మరెవరు ఆలోచిస్తారు?

సీతకు వెంటనే అతనికి థాంక్స్ చెప్పాలనిపించింది. కాని అతడు తనకు అనుకున్నప్పుడల్లా కన్పించడని ఆమెకు తెలుసు.

చిత్రమైన వ్యక్తి.

తనంటే ఎందుకో ఇంత ఇది?

కనీసం అతను తనకు, తన పేరు కూడా చెప్ప లేదు.

ఐర్నెస్ వచ్చాయి.

అతనితో ఆమె బేగం పార్కుకు వెళ్ళింది.

ఆమెకు ఆ తోటలోని ప్రతి పువ్వూ, ఆకూ, తీగా, ఖైరున్నిసా ప్రేమ కథను వివ్పిస్తున్నట్టుగా అనిపించింది.

ప్రేమ!

జగమంతా ప్రేమ మయం!

అతను....తనను....కిర్క్‌పాట్రిక్ ఖైరున్నిసాను ప్రేమించినట్టు ప్రేమిస్తున్నాడా?

ఆ తోటలో ఉన్న చిన్న బంగళాలోకి ఆమె వెళ్ళాలని ప్రయత్నించింది. కాని బర్నెస్ అందుకు అంగీకరించలేదు.

ఖైరున్నిసా ప్రేమ ప్రచండమైనది. ఆ ప్రేమకు ఆమె పరదా అడ్డం రాలేదు. మతం అడ్డం రాలేదు. దేశం అడ్డం రాలేదు.

"వాళ్ళ పిల్లలు ఆనందంగా జీవించారా?"

సీత ప్రశ్నకు అతను చిరునవ్వు నవ్వాడు.

"ఆ ప్రశ్న ఎన్నోసార్లు నాకు నేనే వేసుకొన్నాను" అన్నాడు ఆలోచిస్తూ బర్నెస్

"మరి ఆ ప్రశ్నకు సమాధానం దొరికిందా?" సీత కుతూహలంగా అడిగింది.

బ్లన్ట్ ఆమె కళ్ళలోకి లోతుగా చూశాడు. తల ఊపాడు. "లేదు" అన్నాడు.

ఇలాంటి వివాహాల వల్ల తెలివైన పిల్లలు పుడతారంటారు. ఆరోగ్యంగా కూడా ఉంటారట కాని సంతోషంగా ఉండరట. తండ్రివైపు వాళ్లుగానీ, తల్లివైపు వాళ్లుగానీ ఇలాంటి పిల్లల్ని ఆదరించరట!" సాలోచనగా అన్నది సీత.

"అవును! అలాంటి పిల్లలు చాలా తెలివైనవాళ్లుగా ఉంటారు."

ఆమెకు అజ్ఞాత స్నేహితుడు గుర్తొచ్చాడు.

అతను మేధావి.

అతని తండ్రి ఇంగ్లీషువాడై ఉంటాడు. తల్లి ఇండియన్ అయిఉండాలి.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

సీత బర్నెస్ ముఖంలోకి చూసింది. అతని పెదవులమీద చిరునవ్వు లాస్యం చేసింది.

# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది?



చూడండి, ఇక్కడ
చిక్కని, కమ్మని టీ ఉన్నది

500 గ్రా.,
250 గ్రా.,
100 గ్రా.లలో
దొరుకుతుంది.

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం**
**రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్షలో లిప్టన్ టాప్‌స్టార్‌దే గెలుపు. చూడగానే తెలుస్తుంది దానిలోని ప్రత్యేకత. తాగగానే తెలుస్తుంది దానిలోని మూ
ృైన రుచి.




# లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్

LIPTON

LINTAS-LTS. 8-1811 TL.

సీత తడబడింది.

ఇతను కూడా తెలివైనవాడు. తన ఆలోచనలు పసికట్టాడా, లేదు. అదెలా సంభవం? అతని గురించి బ్లన్టకు తెలియదు. మరెందుకలా నవ్వుతున్నాడు?

అతను-అదే తన స్నేహితుడు - చిన్నతనంలో సమాజ తిరస్కారాన్ని ఎదుర్కొని ఉంటాడు. బాధపడి ఉంటాడు.

సీతకు అతనిమీద ఎక్కడలేని జాలి పుట్టుకొచ్చింది.

బర్నెస్‌ను ఏన్నో అడిగి తెలుసుకోవాలని ఉంది సీతకు.

అంతలో సైన్యాధికారి వచ్చాడు.

అతను హడావిడిగా వచ్చినట్టుగా కన్పించాడు వళ్ళంతా చమట పట్టింది. రొప్పుతున్నాడు

"ఏమిటి? ఏమైంది?" బర్నెస్ అతన్ని అడిగాడు.

"బజార్లో అల్లర్లు ప్రారంభం అయ్యాయి. కాప్టెన్ రోబర్ట్సన్ ప్లటూన్‌తో వెళ్లాడు. సైన్యాన్ని దింపే అవసరం ఉన్నట్టుగా రెసిడెంట్ భావిస్తున్నాడు" అన్నాడు రొప్పుతూ.

"అలాగా? అయితే పద వస్తున్నాను."

బర్నెస్ పక్కగా సీత నడుస్తున్నది.

"అల్లర్లు జరుగుతున్నాయా? అంటే?" సీత బర్నెస్ పక్కగా నడుస్తూ అడిగింది గాభరాగా.

"హిందూ-ముస్లింల మధ్య మతకలహాలు రేగుతూ ఉంటాయి. ఇలాంటి కలహాలకు ఇద్దర్లో ఎవరు ప్రధాన కారకులో మాకు అర్థం కావడం లేదు".

"చాలా సీరియస్ విషయమా?"

---

### గడ్డం అడ్డమా ?



ఇంగ్లండ్ రాణి ఎలిజబెత్-I పరిపాలనలో ఓ తమాషా చట్టం రూపొందించారు. దానిప్రకారం గడ్డాలు పెంచినవారందరూ ప్రత్యేకమయిన "టాక్స్" కట్టాలి.




సీత భయపడుతున్నట్టు గ్రహించాడు బర్నెస్.

"అంత సీరియస్ ఏమీకాదు. ఎప్పుడూ జరుగుతూనే ఉంటాయి మత పిచ్చివాళ్లు ఇలాంటి కలహాలను రెచ్చగొడ్తారు ప్రతి ఐదుగురిలో నలుగురు హిందువులు ఉన్న ఈ ప్రాంతాన్ని ముస్లిమ్స్ పరిపాలిస్తున్నారు."

బర్నెస్ ఉసిగా నడుస్తున్నాడు.

సీత దాదాపు పరుగులాంటి నడకతో అతన్ని అనుసరిస్తోంది

దీనివెనక బ్లంట్ ప్రమేయంగాని లేదు కదా? వెంటనే సీతకు అజ్ఞాత స్నేహితుడు గుర్తొచ్చాడు. అతను మారువేషంలో ఉండటానికి కారణం బ్లంట్ రాజనీతి కాదుకదా? ఏమో! కావచ్చు.

సీతను ఆమె గది గడపదగ్గర వదిలి, బర్నెస్ ఆత్రుతగా వెళ్ళిపోయాడు. సీత అలా వెళ్ళిపోతున్న బర్నెస్‌ని చూస్తూ ఆలోచనల్లోకి జారిపోయింది.

## 6

ఆ రాత్రి జరిగిన డిన్నర్ చాలా గొప్పగా ఉంది. వైస్రాయ్ బంగళాలో జరిగిన డిన్నర్‌కు ఏమాత్రం తీసిపోనట్టుగా ఉంది.

పురుషులు చాలా నీట్‌గా డ్రెస్ చేసుకున్నారు.

ఇక స్త్రీల విషయం చెప్పక్కర్లేదు.

కళ్లు జిగేల్‌మనే నగలు కూడా ధరించారు. రకరకాల సెంట్లు వెదజల్లు తున్న సువాసనలతో ఆ వాతావరణం గుబాళిస్తున్నది.

సీత ఆరోజు దర్జీ కుట్టితెచ్చిన బట్టలు వేసుకొన్నది. అయినా ఆ స్త్రీల ముందు తను వెలవెలాపోతున్నట్టుగా భావించింది.

ఇంకానయం! ఈ డ్రెస్‌కూడా లేకపోతే? తన చౌకబారు దుస్తుల్లో రాక తప్పేది కాదు. అప్పుడు తను కర్రకు వేలాడదీసిన దిష్టిబొమ్మలా ఉండేది. సీత కళ్లు పెద్దవిచేసుకొని ఆ స్త్రీలు ధరించిన నగల్ని చూడసాగింది.

ఆ డ్రెస్ వేసుకొని అద్దంలో ప్రతిబింబం చూసుకొన్నప్పుడు, కథల్లోని రాజకుమారిలా తనకు తనే కన్పించింది. చాలాసంతోషంగా డిన్నర్‌కు వచ్చింది. తెల్లని పట్టుమీద కుట్టిన జరీపువ్వులు నక్షత్రాల్లా జిలుగులు వెదజల్లుతున్నాయి.

సీత మెడచుట్టూ తెల్లటి రిబ్బన్ కట్టుకొన్నది. చిన్న గులాబిపువ్వును అమర్చుకున్నది రిబ్బన్ ముడిమీద.

సర్ హార్వే పక్కగా నడుస్తూ డిన్నర్ హాల్లో ప్రవేశిస్తున్నప్పుడు ఆమె గుండె వేగంగా కొట్టుకొన్నది.

సర్ హార్వే ఆమె దుస్తుల్ని గమనించలేదు. అతనికి అలాంటి విషయాలు బుర్రకు ఎక్కవు.

సర్ హార్వే ఇండియాలో ఉండగా, గౌరవసూచకంగా పొందిన గోల్డ్ పతకాన్ని కోటుకు తగిలించుకున్నాడు. ఆరాత్రి డిన్నర్‌కు వచ్చినవాళ్లు చాలా మంది అలాంటి చిహ్నాలను ధరించి ఉండటం చూసింది సీత. కొందరు రెండూ మరికొందరు మూడు చిహ్నాలను కూడా తగిలించుకొని కన్పించారు. అవన్నీ వారి సేవలకు లభించిన గుర్తులు, బిరుదులు లాంటివి.

రెసిడెంటు వచ్చాడు. అతను లావుగా ఉన్నాడు. అందంగా అలంకరించుకున్నాడు. తన ప్రత్యేకతను ప్రతి కదలికలోనూ చూపిస్తున్నాడు.

ముస్లిమ్స్ మంచి ఇంగ్లీషు మాట్లాడుతున్నారు. కొందరు రెసిడెన్సీ డిన్న

ర్కు ఆహ్వానం అందుకోవడం తమ అదృష్టంగా భావిస్తున్నారు. వాటికి గర్వంగా కూడా ఉన్నది. అది వాటి మాటల్లో వెల్లడి అవుతోంది.

సీతకు ఇరువక్కల కూర్చున్నవాళ్లు, ఆమెతో ఏదేదో మాట్లాడుతున్నారు. ఆమె మౌనంగా వింటూ కూర్చుంది. ఆమెకు అందర్నీ మౌనంగా చూడాలని ఉంది. ఆ ఆనందాన్ని మౌనంగా ఉండి అనుభవించాలని ఉంది. అందుకే ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడలేదు.

డిన్నర్ అయాక అందరూ దర్బార్ హాల్లో ప్రవేశించారు.

హాల్లో ఎత్తుగా ఉన్న స్టేజీమీద బంగారుపూతలో ఉన్న సింహాసనాల్లాంటి కుర్చీలు ఉన్నాయి. ఆ స్టేజీకి ఎదురుగా హాల్లో ఉన్న కుర్చీలలో ఒక్కొక్కరే కూర్చుంటున్నారు. సీత హాలుగోడలకు ఉన్న ఫోటోలనూ, చిత్రాలలోనూ చూడ సాగింది. దర్వాజాలకు ఉన్న పరదాలుకూడా చాలా ఖరీదైనవి. ఆమెకు అంత పెద్దహాల్లో ఊపిరి వలపనట్టుగా ఉన్నది.

తను కలలో కూడా ఊహించని అందమైన లోకంలోకి విసిరేయబడి నట్టుగా అన్పిస్తోంది సీతకు.

స్టేజీమీద ఇండియన్ మ్యూజిక్ ఏర్పాటు చేశారు. మృదంగం, నట్టువాంగం, ఫ్లూట్ (పిల్లనగ్రోవి) కూడా ఉన్నాయి. సీతకు ఆ మ్యూజిక్ వింటుంటే థ్రిల్లింగ్‌గా ఉంది.

డ్యాన్సు ప్రారంభం అయింది. ముందుగా గణపతిపూజ (నందన గణపతి) అభినయం చేసింది నర్తకి. నర్తకి ధరించిన దుస్తులు తాలూకు జిగజిగలు సీత కళ్ళల్లో ప్రతిఫలించాయి. గణపతిని భారతీయులు విఘ్నాలను దూరం చేసే భగవంతుడిగా ఆరాధిస్తారని సీత పక్కనే కూర్చున్న ఓ స్త్రీ వివరించి చెప్పింది.

---



"ఇచ్చట స్వచ్ఛమైన తేనె తయారు చేయబడును" ఇట్లు తేనెటీగలు.—ఒక కిలో తేనెను తయారు చేయడానికి పాపం—తేనెటీగలకు సలభై లక్షల పూల మకరందాన్ని పోగుచేస్తాయి.




సీత మనసులోనే విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థించింది. తనకూ తన నేస్తానికి మధ్య ఎలాంటి అడ్డంకులు రాకూడదని ప్రార్థించింది.

భారతీయ నృత్యం సీతను ఎంతగానో ఆకర్షించింది. అభినయం ద్వారా ఎన్నో విషయాలు చెప్పగలరు. మాటల అవసరం లేకుండానే కథ చెప్పగలరు.

ఇంగ్లీషువాళ్లు చాలామంది ఆవలిస్తున్నారు. సైనిక సిబ్బంది ముఖాలు విసుగ్గా పెట్టారు. వాళ్లు ఇలాంటివి చూసి చూసి విసుగెత్తిపోయి ఉంటారు.

ప్రోగ్రాం ముగిసింది. ముస్లిమ్స్ వెళ్ళిపోయారు. ఇంగ్లీషువాళ్లు బాల్ రూం డ్యాన్సుకొరకు ఏర్పాటుచేసిన చిన్న హాల్లోకి వెళ్లారు.

ఇంగ్లీషు మ్యూజిక్.

బాల్ రూం డ్యాన్సు ప్రారంభం అయింది.

జతలు ఏర్పడ్డారు.

విల్ ఫ్రెడ్ బ్లంట్ సీతదగ్గరకు వచ్చి తనతో డ్యాన్సు చెయ్యవలసిందిగా కోరాడు.

ఆమె అందుకు అంగీకరించింది.

అతను అందగాడు అని అందరూ అంగీకరిస్తారు. ఇటీవల గడ్డం పెంచాడు.

"గడ్డం లేకుండా ఉంటే ఇతను ఇంకా అందంగా ఉంటాడు" అని మనసు లోనే అనుకున్నది సీత.

సీత డ్యాన్సుచేస్తూ "ఇతను మంచి డ్యాన్సర్ కూడా" అనుకొన్నది.

డ్యాన్సు చేస్తూ చేస్తూ అనుకోకుండా బ్లంట్ సీతను బయటకు తీసుకెళ్లాడు. ఆమెను గార్డెన్‌లోకి తీసుకెళ్లడానికి ప్రయత్నించాడు.

"నాకు భయంగా ఉంది. అక్కడ తోడేళ్లు ఉంటాయటగా?" ముందుకు అడుగువెయ్యడం ఇష్టంలేనట్లు ఆగి అన్నది సీత,

"పర్వాలేదు. నేను నీ పక్కనఉండగా నీకెలాంటి హానికలగదు సరేనా?" మెత్తగా అన్నాడు బ్లంట్.

అయినా ఆమె ముందుకు అడుగువెయ్యలేదు.

"సీతో మాట్లాడాలి. అలా వెళ్దాంరా!" అన్నాడు.

"నాతో మాట్లాడాలా? ఏం మాట్లాడతారు? దేన్ని గురించి?" గబగబా, గాభరాగా అడిగింది సీత.

అతను ఓ క్షణం ఆమె ముఖంలోకి చూశాడు

"ఇప్పటికి నా భావాలను నువ్వు అర్థంచేసుకున్నావనే అనుకొంటున్నాను. ఇండియా స్వతంత్రదేశంగా అంటే హోమ్‌రూల్‌లో ఉండాలని...."

"ఆ విషయం విన్నాను" మాట పూర్తికాకుండానే సీత అన్నది.

"వైస్రాయ్ కూడా నా అభిప్రాయాలతో కొంతవరకు ఏకీభవిస్తున్నాడనే చెప్పగలను. ఆయనకు మీ బాబాయి అంటే చాలా గౌరవం. అలాగే మిస్టర్ కార్డరీ అంటే కూడ ." ఆగి ఆమె ముఖంలోకి చూశాడు.

సీత మౌనంగా ఉండిపోయింది

"నువ్వు చాలా అందంగా ఉంటావు. అంతేకాదు, చాలా తెలివైనదానివి కూడ. మీ బాబాయికి నా గురించి చెప్పి, నేను ప్రతిపాదించిన బిల్లు పాసయ్యేలా చూడమని చెప్పు."

సీత ముందు ఆశ్చర్యంగా చూసింది.




ఆ తర్వాత పకపక నవ్వింది.

సీతను ఆమె బాబాయి ఎంత గౌరవిస్తాడో, ప్రేమిస్తాడో ఆమెకు బాగా తెలుసు. ఇంగ్లాండులో ఉండగా తిట్లు తినవిరోజు చాలా అరుదు. సీతను వట్టి తెలివితక్కువ దద్దమ్మగా అతను భావిస్తాడు. ఇండియా వచ్చాక అతనికి సీతను తప్పులుపట్టే టైంలేదు. హార్వే రాసే స్క్రిప్టును కాపీచెయ్యడానికి ప్రభుత్వమే సెక్రటరీలను ఇచ్చింది. ఇప్పుడు ఆ పని లేనందువల్లనే సీతకు బాబాయి తిట్లు తప్పాయి.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"మా బాబాయిదగ్గిర నాకు ఇలాంటి విషయాలు చర్చించేటంత చనువు లేదని చెప్పడానికి బాధపడుతున్నాను. ఆయన దృష్టిలో నేను చిన్నపిల్లను, ఇలాంటి పెద్ద విషయాల్లో జోక్యం కలుగజేసుకోకూడదు."

"నీనుంచి ఇలాంటి సమాధానమే వస్తుందని నాకు తెలుసు" అని ఆగి ఒ క్షణం ఆమె ముఖంలోకి చూసి మళ్ళీ అన్నాడు—"నువ్వు చాలా అందంగా ఉంటావు. ఆడదానికి ముఖ్యంగా కావల్సింది అందం. తెలివితేటలు కాదు."

అతని కంఠంలోని మెత్తదనానికి ఆమె ఆశ్చర్యపోయింది. అతనిచూపులు కూడా అదోలా ఉండి సీతను ఇబ్బంది పెట్టసాగాయి.

సీతకు అక్కడ్నుంచి వెంటనే వెళ్ళిపోవాలనిపించింది. (సశేషం)

# షోకేసులో బొమ్మ

'కల్యాణి' దేవి



ప్రపంచ సింహాసనాన్ని జయించి నంత వుత్సాహంతో ఇంటిని ఇంట్లో మనుషుల్ని ఏకం చేస్తోంది కాంచన.

తనిప్పుడో ఆఫీసర్. కుటుంబంలో మొగాళ్లు నోరు తెరిచేస్తారు. ఆడవాళ్ళు అమ్మో, అమ్మో అని ఆశ్చర్యంతో బుగ్గలు నొక్కేసుకుంటారు. ఇటు తల్లి వైపు కాని, తండ్రి వైపుకాని ఒక్కసారి డైరెక్టుగా ఆఫీసర్ పోస్టులో కొచ్చిన వాళ్లు మొగవాళ్ళలోనే లేరు. ఇక ఆడవాళ్ళలో లేరని వేరే చెప్పాలా?

తండ్రి రామనాథంగారు మాత్రం సగర్వంగా కూతుర్ని చూసుకుని వెండి మీసాలు మెలేశారు.

ఎటొచ్చీ కాంచన విజయాన్ని అంతగా పట్టించుకొని విలువ ఇవ్వద

బ్బాకోలేదు ఆమె తల్లి సీతమ్మగారు.

ఏమిటో తండ్రి కూతుళ్లు తెగ సంబర పడిపోతున్నారు. కాని ఆడపిల్లకి అంతలేసి చదువులేమిటి .... వుద్యోగాలేమిటి? మతిమాలిన పన్లు కాకపోతే.... పాతికేళ్లు వస్తున్నాయి - పెళ్ళిగుర్తూ చూడకుండా దానితో పాటు మీరు కూడా అలా నిప్పులు తొక్కినట్టు గంతులేస్తారేమి? ఇప్పుడు దానిచేత వుద్యోగం చేయిస్తారు కాబోలు ఖర్మ ఇంటావంటా లేనివన్నీ తెచ్చి పెట్టున్నారు. దీనికి నేనెంత మాత్రం ఒప్పుకోను." ఖంగు ఖంగున అంటున్నారు సీతమ్మగారు బాబోయ్ .... రక్షించండి నాన్నగారు అన్నట్లు తండ్రివైపు చూసి ఆయన కుర్చీ వెనకాతలకి వెళ్ళి,

ప్లీజ్....మమ్మీ....నువ్వెంతో మంచి దానివి కదూ? నన్ను వుద్యోగంలో చేరనియ్యి అసలయినా ఆఫీసరయిన కూతుర్ని చూసి నువ్వెంత గర్వపడాలి. పల్లెల్లో, ఇంటా, బయటా నా కూతురికి డైరెక్టుగా ఆఫీసర్‌గా పోస్ట్ వచ్చిందని ఎంతో గొప్పగా చెప్పుకోవాలి అబ్బో ఆఫీసర్‌గారి తల్లి అంటె ఎంత గౌరవం, ప్రిస్టేజ్.... అం.... బొనా నాన్నగారు....మీరు మాట్లాడరే" ముందుకి వంగి ఆత్రంగా అన్నది.

"బాబోయ్ అమ్మాయ్ చెప్పింది నిజమే నీకప్పుడు ఎంత హోదా. అంతస్తు ఆఫీసర్‌గారి భార్య హోదాలో పాతపడి పోయావు ఇప్పుడు ఆఫీసర్‌గారి తల్లిగా ఘనతకెక్కు. అయినా నీ గొడవంతా దాని పెళ్ళి గురించేగా? చూడిప్పుడు ఎంతెంత మంది మనమ్మాయిని చేసుకుంటామని వస్తారో... తొందర పడక మంచి చదువు, హోదా.... మనమ్మాయికి మరో మెట్టు పైనున్న వార్ని తెచ్చి ఘనంగా పెళ్లి చెయ్యక పోతే నా పేరు రామనాథం కాదు మనమ్మాయికేం తక్కువని అలా బెంగ పెట్టుకుంటావ్, చూస్తుండు సంబంధాలెలా పరుగుపందేలు వేసుకుని వస్తాయో ధీమాగా, తను చెప్పిన దానికి ఎదురు లేదన్నట్లుగా చెప్పుకు పోయారు,

కన్న కూతురంత ప్రయోజకురాలయితే ఏ తండ్రికి సంతోషానికి పగ్గాలు వుంటాయి?

"ఏమో బాబు....ఏమిటో ఈ పిచ్చి ధైర్యం మంచి చెడు, బాధ్యత బరువూ నున్న మీకూ చెప్పలేను. అనుభవం లేని దీనికి చెప్పలేను. మధ్య నాకు పట్టింది ఇదంతా. ఖర్మ .... నోరు మూయించి ఏ పదిహేనో ఏబో ఆ మూడు ముళ్ళు వేయిస్తే ఇంత గొడవ వుండకపోను....ఏం చదువులో, వుద్యోగాలో....ఆడపిల్ల కూడా చెప్పిన మాట వినడం పోయింది. అసలు దీనికింత కొమ్ములొచ్చి వినకపోవడానికి కారణం మరింకేం కాదు....తండ్రి మద్దతు ....

ఎంత ముద్దయితే మాత్రం...." ఆవిడ వణుగుడు వంటింట్లోంచి సన్నసన్నగా వినిపిస్తూనే వుంది.

తండ్రీ కూతుళ్ళు ఒకళ్ళనొకళ్లు చూసుకుని నవ్వుకున్నారు.

o o o

మరో పదిరోజుల్లో కాంచన ఆఫీసుకి వెళ్ళసాగింది. ముందు వూహించినట్లే రామనాథం, సీతమ్మగార్లు ఎక్కడికి వెళ్లినా కూతురి గురించి ఘనంగా, గొప్పగా చెప్పుకోడం తల్లిదండ్రులైనా వీరిని అందలం ఎక్కించడం జరుగుతోంది.

ఆరోజు సీతమ్మగారు గుడికెళ్లారు. గుళ్లో ఇరుగమ్మ, పొరుగమ్మ కల్సారు.

"ఏమండీ సీతమ్మగారు మీ అమ్మాయి ఆఫీసరయిందట కదా? అదృష్టం అంటె మీదేనుమండీ? ఆడపిల్లయినా, మగపిల్లవాడయినా అలా కన్నవాళ్ళకి ప్రయోజకులయి ఆనందం కలిగించాలి. మా రెండోవాడు బి. యస్సీ పూర్తి చెయ్యడానికి మూడు చెరువుల నీళ్లు తాగుతున్నాడు. మమ్మల్నితాగిస్తున్నాడు, అదృష్టం అంటే మీదేలెండి...." లోలోపల ఎంత కసుక్కుగా వున్నా పైకి మాత్రం ఎంతో సంతోషిస్తున్నట్లుగా అందరు సీతమ్మగారి దంపతుల అదృష్టాన్ని వేనోళ్ళ పొగిడారు.

"ఔను పెళ్లెప్పుడు చేస్తారు? అబ్బా, కాంచన కంటె పెద్ద పుద్యోగస్తుణ్ణి వెతకాలంటె మాటలా? మళ్లీ కుటుంబ గౌరవాలు, కులగోత్రాలు, ముఖ్యంగా కట్నం ....అయినా ఇవన్నీ మనం చూస్తే కావాలి కాని, పుటుక్కున తన ఆఫీసులో వాళ్ళనెవర్నయినా ప్రేమిస్తే ఈ గొడవలేమి వుండవు....వదినగారికి అసలు బరువు వుండదు...." తనేదో పెద్ద జోక్ వేసినట్లు ఫకాలుమని నవ్వింది, అందర్నీ కలయచూస్తూ ఓ పొరుగమ్మ. మిగతావారు కూడా శ్రుతి కలిపారు.

సీతమ్మగారి మనస్సు ఒక్కసారిగా కలుక్కుమంది. మొహంలో కాంతి తగ్గింది.

ఇంటికెళ్తూనే గుళ్లో అమ్మలక్కలన్న మాటలు చెప్పి "మీరాలస్యం చేస్తే నేనిక ఒప్పుకునేది లేదు. తెల్సీ తెలియని వయస్సు.... వాళ్ళన్నట్టు జరిగితేనా? .... అమ్మో .... ఇంకేదైనా వుందా? మనం నల్గురిలో తలెత్తుకోగలమా? ఏమండీ....నామాట విని అమ్మాయి పెళ్ళి విషయంలో తొందర పడండీ...."

రోజు వింటున్న పోరే అయినా ఆ రోజెందుకో భార్య మాటలు వింటుంటె ఆయనకీ నిజమే అన్పించింది.

రామనాధంగారు అర్జెంటుగా సంబంధాల వేటలో పడ్డారు.

o o o

కాని రామనాధంగారు అనుకున్నట్లు ఏమంత తేలిగ్గా సంబంధాలు దొరక

# కవితాగానం చేసే కళ్లకు...



## ఐటెక్స్

చూపులనే మాటలుగా మార్చే ఐటెక్స్

అపురూప సౌందర్యంతో పొంగిపోయే
యవ్వనంతో మురిపించే వనితల వదనాలను
ఆకర్షించే అతివల కళ్లను, ఆనందంగా
కొనచూపులతో నటనమాడించేది ఐటెక్స్
శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ కాటుక అందాలు చిందేటి
యువతుల కళ్లను దోషమేమీ చేరనీయక
చల్లగా కాపాడుతుంది...




**ఐటెక్స్** 40 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబొరేటరీస్
మద్రాసు 600033

Imageads M-AL-1293 Tel.

లేదు. ముందు అందం, ఇతర విష యాలు కంటే పెళ్ళికొడుకు హోదా ముఖ్యమయి పోయింది.

డబుల్ డిగ్రీలు చదివినా వుద్యోగం లేకపోవడమో, అధవా వుద్యోగంవున్నా అది కాంచన ఆఫీసరు వుద్యోగానికి సరితూగక పోవడమో జరిగింది పది పదిహేను సంబంధాలు చూసినా దేనికి బంగరు కుదర్లెదు.

పెద్ద పెద్ద వుద్యోగాల్లో, బోలెడు మంది యువకులు వున్నారని భార్యని పూర్కో పెట్టిన రామనాధంగారికిప్పుడు కాస్తంత కలవరం పుట్టుకొచ్చింది.

ఏమిటబ్బా.... ఇన్ని సంబంధాలు చూసినా పొత్తు కుదరవేమి? ఎలాగ యితే అయిదారు నెల్లు కష్టపడి మంచి వుద్యోగాలున్న అబ్బాయిలకి ప్రాము ఖ్యం ఇచ్చి ఇద్దరు ముగ్గుర్ని పట్టు కొచ్చారు.

ఒక ప్రబుద్ధుడు కాంచన వుద్యో గం, ఆమెను చూసిన తర్వాత ఓఆమడ దూరం పరుగెత్తినంత పని చేశాడు.

"అంత చదువుకొని అంత పెద్ద వుద్యోగం చేస్తున్న అమ్మాయి నా చెప్పు చేతుల్లో వుంటుందా? పెద్దలమీద గౌరవం చూపిస్తుందా? ఈ రోజుల్లో మామూలుగా చదువుకున్న వాళ్ళకే సమాధానాలు చెప్పలేక పోతున్నాం. ఇంత చదివి, ఇంత పెద్ద వుద్యోగం చేస్తూ భర్తని గౌరవిస్తుందా? అలాంటి యక్ష ప్రశ్నల్లాంటివి రామనాధంగార్ని వేసి ఆయన తెల్లబోయి చూస్తుంటే ఒక్క పరుగు తీశాడు.

ఔరా! ఎంతటి ప్రబుద్ధుడు? తన మీద తనకే నమ్మకం లేనివాడుగా కన్పిస్తోంది. ఎంతటి వుద్యోగాలు చేస్తున్నా, ఎన్ని వూళ్ళేలినా భార్య భర్త మాట వినదూ? వినేలా చేసుకోడం తన చేతుల్లో వున్నదని తెలియదుకాబోసు ఈ పెద్ద మనిషికి ...

వుత్తి పిరికిగొడ్డు అని తాటాకులు కట్టింది కాంచన.

మరో హోదా కల్గిన పెళ్లికొడుకు

"అందం, చదువు, వుద్యోగం హోదా అన్ని బాగానే వున్నాయి....నా చదువుకి, నావుద్యోగానికి, నాహోదాని చూసి నాకిప్పుడు సంబంధాలు నేనంటె నేనేనని వస్తున్నాయి. ప్రస్తుతం ధర లక్ష పలుకుతోంది. మరి మీరేమంటారు?" అనే ధోరణిలో మాట్లాడటం చూసి నోరు తెరిచేశారు రామనాధంగారు.

"అదేమిటి నాయనా? నీ గ్రేడ్ వుద్యోగమే చేస్తూ, నీ అంత హోదా, జీతం కలిగిన పిల్లకి కూడా కట్నం కావాలా? పైగా పిల్ల ఎంత లక్షణంగా వుంటుంది" తేర్చుకుని అడిగారు.

నువ్వో పిచ్చోడివి అన్నట్లు నవ్వి.

"భలేవారండి.... పిల్ల లక్షణంగా వుంది. నాతో చదివి వుద్యోగం చేస్తుం దంటేనే కదా మిగతా సంబంధాలన్ని




వదిలేసి మీ అమ్మాయిని కన్సిడర్ చేస్తోంది? అది చాలదూ? లక్ష కాక పోయినా ఆ దరిదాపు అంకెదైనా వుందేమో చూడండి...." ఎంతో భూతదయ కల్గిన వాడిలా పోజు పెట్టాడు.

అతగాడి పోజు చూసిన రామనాథం గారికి అరికాలిమంట నెత్తికెక్కింది.

వీడి దర్జా మండిపోను. లక్ష రూపాయలు కావాలా? పైగా సంబంధాన్ని కన్సిడర్ చేశానంటాడా? వీడు కాకపోతే వీడి బాబులాంటివాడు దొరుకుతాడు. పోరా వెధవాయ్ అని అరవాలనుకుని సభ్యత అడ్డొచ్చి మానేశారు

"నాన్నగారు. ఇంత కట్నం పిచ్చి వున్నవాళ్ళు మరెప్పుడూ ఇంటిగడప కూడా తొక్కనివ్వకండి. చదువు, సంస్కారాలతో పనిలేనివాడితో మనకి పొత్తుకుదరదు .... లక్ష కాకపోతే పది లక్షలు పుచ్చుకుని ఓ మొద్దుని చేసుకోమనండి బడుద్ధాయ్ని...." అని చీపురు కట్టలేకుండా దులిపేసింది కాంచన.

వీళ్ళిద్దర్ని కలవకుండా మరో అవతారం ఈ విధంగా శెలవిచ్చింది.

"చూడండి రామనాథం మావయ్యగారు ఎంత పెద్ద ఆఫీసరయినా, ఆడపిల్ల అన్నతర్వాత గృహిణిగా అన్ని బాధ్యతలు చేపట్టాలి కదా? మాది పెద్ద కుటుంబం. నల్గురం వున్నవాళ్ళం మా వదినలతోపాటు ఇంట్లో వంటా-గింటా లాంటివి చెయ్యాలి .... ఇంట్లో మంచి చెడ్డలు చూసుకోవాలి మా అమ్మ అనారోగ్యం మనిషి....ఆవిణ్ణి జాగ్రత్తగా చూసుకోవాలి ఇంకో విషయ.

నేనే వుద్యోగం చేస్తున్నాను కాబట్టి డబ్బుకూడా నా స్వంతమే అనుకుంటే ఎలా చెప్పండి? నల్గురున్న కుటుంబం. ఏవో అవసరాలు వుంటూ వుంటాయి. జీతం గట్రా నాకిచ్చేస్తే నేనే జాగ్రత్త చేస్తాను పెళ్లయ్యాక డబ్బు తనదీ నాదీ అనేభేదం ఎలావస్తుంది చెప్పండి. అంతా ఒకటే కదా?...." హ్హి హ్హి హ్హి అని నవ్వాడు అభేదం తన ధర్మ సూత్రం అన్నట్లు.

ఏమిటేమిటి? డబ్బు సంపాదించే యంత్రంలాగా, ఇంట్లో పనిచేసేదాని లాగా....అహో! తెలివంటే నీదే కదా మహాశయా? ఎంత సుళువుగా మా అమ్మాయిని కట్టుకుని పోదామనుకున్నావయ్యా? దాని జీతం నీదగ్గర జాగ్రత్త చెయ్యాలా? మా బాబే....ఏవండీ....నా ఖర్చులకి డబ్బు అని అడుగుతే ధర్మ రాజులా ఇస్తాడు కాబోలు .... నీలాంటి మూర్ఖుడిచేతిలో పిల్లను చచ్చినా పెట్టను గాక పెట్టను....పోవయ్యా....అనుకుని సాధ్యమైనంత సగౌరవంగా వచ్చిన దారి చూపెట్టారు ఆ మహాత్ముడికి.

"నాన్నగారూ ఇప్పుడొచ్చిన వాడిది అతితెలివి ఇంట్లో పనికి ఇబ్బంది లేకుండా చాకిరి చెయ్యమని-దానికో అందమైన పేరు 'గృహిణిగా బాధ్యతలు నెరవేర్చడం' అని చెవులకింపుగా చెప్పాడు. మరోవైపునుండేమో నా జీతం కావాలి అని దానికి మహా అందమైన వాక్యాల కూర్పుతో చెప్పాడు. పెళ్లిచూపుల్లోనే ఇన్ని నియమాలు పెట్టాడు తాళికట్టాక చూడాలి. బాబోయ్ ఆ వచ్చే అమ్మాయిని ఆ దేవుడు రక్షించు గాక .." అని హడలిపోయింది కాంచన.

ం ం ం

మొత్తానికి ఎలాగయితేనేం మరో సంబంధం వచ్చింది. అతగాడు బొంబాయి మహానగరంలో ఓ పెద్ద వుద్యోగం చేస్తున్నాడు. ఇప్పటివరకు వచ్చిన వాళ్ళకన్నా మెరుగుగానే కన్పించాడు. పైకి హుందాగా కన్పించాడు ఎక్కువ మాట్లాడలేదు. పిల్లనచ్చిందని ఓ రెండు ముక్కలు మాట్లాడి వెళ్లిపోయాడు. వెళ్తూ వెళ్తూ వీలైనంత త్వరలో తల్లి దండ్రులను పంపుతాను, వాళ్ళు నీతో మాట్లాడ్తారన్నాడు.

వెళ్లేప్పుడు కాంచన కళ్లలోకి చూసి చిన్నగా నవ్వి కళ్లతో ప్రేమసందేశం లాంటిది (అలాంటిదనే అప్పట్లో కాంచన వూహించింది) ఇచ్చి వెళ్లాడు.

అతగాడి మాటప్రకారం అతని తల్లీ తండ్రీవచ్చారు. పిల్లని చూశారు. అన్నీ బాగున్నాయి అనుకున్నారు.

లాంఛనప్రాయంగా కట్నం ఇచ్చు కోవాలని అన్నారు....కట్నం ఇవ్వద్దని తండ్రితో చెప్పాలని గింజుకుంది కాని రామనాధంగారు కూతురికాఅవకాశం ఇవ్వలేదు. ఎందుకంటే పరమసత్యాన్ని

ఆడపిల్లకి ఎని విధాల అన్నివున్నా .. కట్నం అనేది తప్పదని .... తెల్సుకుని తనపరిధి దాటకుండా కట్నం ఇచ్చుకుని పెళ్లి నిశ్చయించారు.

ఆ తర్వాత పెళ్ళి. మొదలైనవన్నీ చకచకా జరిగిపోయాయి.

అదృష్టవశాత్తు కాంచన ఆఫీసు బ్రాంచి బొంబాయిలో వుండడం మూలాన ఓ నాలుగునెలల్లో తనూ బొంబాయి ఆఫీసుకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుంది కాంచన.

ఇద్దరూ కొత్త కాపురం మొదలు పెట్టారు.

అక్కడికి కాంచనని తీసుకెళ్లిన కొత్తలో పార్టీ ఏర్పాటుచేశాడు ప్రభాకర్ ఆఫీసులోవాళ్లంతా కట్ట కట్టుకుని వచ్చారు అందరు ప్రభాకర్ అదృష్టాన్ని వేనోళ్లకాకపోయినా నోరు నెప్పి పుట్టేవరకు పొగిడారు.

"అదృష్టం అంటే నీదోయ్ ప్రభాకర్.. మంచి చదువు, ఉద్యోగస్థురాలే కాక అందమైన అమ్మాయిని సంపాదించావు...."

ప్రభాకర్ మొహంలో గర్వరేఖలు వెల్లివిరిసాయి. మరింత ఠీవిగా, దర్జాగా పై సర్దుకున్నాడు పార్టీ సగంలో వుండగా అతని ఫ్రెండ్ ఒకతను పరిగెత్తుకున్నట్లుగా వచ్చాడు.

"కంగ్రాచ్యులేషన్స్ ప్రభాకర్ గారు....విష్‌యు హాపీ అండ్ సక్సెస్‌ఫుల్ మారీడ్ లైఫ్ ...." అంటూ కాంచనవైపు చూసిన ఆతగాడు మొహం తెల్లబోయి తర్వాత సంతోషంగా, హృదయపూర్వకంగా....

"అరె....కాంచనా .... మీరా .... వాట్ ఎ ప్లెసెంట్ సర్‌ప్రైజ్....ఆరోజు మనం విడిపోయ్యాక మళ్లీ కలుసుకోడం అవలేదు. అయామ్ సో హాపీ టు సీ యు ఎగైన్. పోన్లెండి మా ఫ్రెండ్‌తో ముడిపడిం కదా అప్పుడప్పుడు చూస్తుండవచ్చు. ఇక చూసుకోండి ప్రభాకర్. ఇదివరకు రాలేదు, రాలేదనేవారు. ఇప్పుడు శెలవురోజులన్నీ మీ ఇంట్లోనే కాంచనగారు కూడా వున్నారుగా" అని గలగలా మాట్లాడేస్తున్న ఫ్రెండ్‌మాటలకి ప్రభాకర్ మొహంలో రంగులు మారాయి.

కాంచన మొహంలోకి ఓరగా చూశాడు. కాంచన కూడ స్నేహపూరితంగా సరదాగా అతనితో మాటలు కలిపింది.

అంతవరకు భార్యతో సరదాగా కబుర్లు చెప్తున్న ప్రభాకర్ ఒక్కసారిగా ముభావంగా మారిపోయాడు.

అందరూ వెళ్లిపోయాక బట్టలని మార్చుకుంటున్న కాంచనకి భర్తలో వచ్చిన మార్పుకి కారణం ఏమిటో అర్థంకాక తికమకపడింది.

"ఏవండీ .... అలా వున్నారేం?" అని అడిగింది భర్తపక్కలో కూర్చుని.



రెండుక్షణాలు కాంచన కళ్ళల్లోకి తదేకంగా చూశాడు ప్రభాకర్. కాంచన అందమైనదే ... గిరీ ఆకర్షణీయంగా వుంటాడు .... ఇద్దరు ఒకళ్ళనొకళ్లు చూసుకుని ఎంత సంతోషపడి పోయారో... వీళ్ళిద్దరూ....

అతని ఆలోచనలు తొక్కకూడని దారులు తొక్కబోయాయి. దానికి కాంచన మాటలు అతని ప్రస్తుతంలోకి లాక్కొచ్చాయి

"అలా వున్నారేం? తలనొప్పిగా వుందా?" మృదువుగా అడిగింది.

"ఊహు...." అని రెండుక్షణాలు వూరుకుని "గిరి నీకెలా పరిచయం?" అని అడిగాడు,

"నేను అతనూ ఒకేసారి ఆఫీసర్స్ ట్రైనింగ్‌కు వెళ్లాం. అప్పుడు అతనితో పరిచయం అయింది" ఇప్పుడు అతనివిషయం ఎందుకన్నట్లు చూసింది

"అలాగా...." అని వూరుకున్నాడు. అతని మనోభావాలు తెలియని కాంచన మరింకేమీ మాట్లాడలేకపోయింది. అతనింకేమైనా మాట్లాడ్తాడేమోనని కాసేపు ఎదురు చూసి నిద్రలోకి జారిపోయింది ఆ రాత్రి చాలభాగం గిరి, కాంచనల స్నేహాన్ని ఎన్నోవిధాల, ఎన్నో కోణాల్లోంచి చిత్రీకరించుకుంటూ అర్థంలేని ఆలోచనలతో గడిపాడు ప్రభాకర్.

ఆ మర్నాడు ఎర్రటి కళ్లతో నిద్ర

లేచాడు ఆ రోజంతా అంటీముట్టనట్టు గానే ప్రవర్తించాడు. అతని ప్రవర్తన ఏమిటో అర్థంకాక, అతనెలా అడగాలో తెలియక కాంచన కూడా అస్థిమితంగా తయారయింది రెండురోజుల తర్వాత తిరిగి మామూలుగా మసల సాగాడు ప్రభాకర్. అతని ప్రవర్తనకి అర్థం కల్పించలేదు కాంచనకి.

నాలుగయిదు రోజులు గడిచి పోయాయి.

ఆరోజు సాయంత్రం కాంచన ఆఫీసునుండివచ్చేసరికి ప్రభాకర్ ఇంకా రాలేదు టీతాగి మొహం కడుక్కుని చల్లగాలికోసం బాల్కనీలో నిలబడింది. పక్క బాల్కనీలో ఓ ముప్పైఏళ్ళతను కాంచన్ని గమనిస్తున్నాడు. ఇది గమనించిన ఆమె తల మరోవైపుకి తిప్పుకుని ట్రాఫిక్‌ని చూడడంలో మునిగి పోయింది అయిదు నిమిషాలు గడిచింది.

"ఎక్స్‌క్యూజ్‌మి....." అన్న మాటలకి తలతిప్పిచూసింది కాంచన. పక్క బాల్కనీ అతను! ఆమె తనవైపు తిరగ్గానే చిరునవ్వుతో—

"మీరు వచ్చినప్పట్నుంచిపరిచయం చేసుకుందాం అనుకుంటున్నాను. మీవారితో పరిచయం చేసుకున్నానులెండి. మీరే ఆఫీసులో పని చేస్తారు?....." అతని మాటల్లో స్నేహం-సంస్కారం తప్ప మరేమీ లేవు .... అందుకే ఆమె కూడా స్నేహపూరితంగా జవాబిచ్చింది ఫలానా ఆఫీసులో అని.

"అరే .... అయితే రోజూ మీరు, నేను ఒకేవైపు వెళ్ళాలి. మీ ఆఫీసు దాటేకే మా ఆఫీసు 'ఫలానా' ఆఫీసు మాది" అని చెప్పాడు. ఇలా ఇద్దరూ ఆఫీసుల గురించి మాట్లాడుకుంటున్నారు. పదినిమిషాలు గడిచాక ప్రభాకర్ వచ్చాడు. వస్తూనే కాంచన పక్కతనితో సంభాషించడం చూశాడు.

కనీసపు మర్యాదైనా పాటించకుండా వాళ్ళిద్దర్ని తప్పించుకుని లోపలికి వెళ్ళబోతుంటే బాల్కనీ అతనే విష్‌చేశాడు 'గుడ్ ఈవినింగ్' అంటూ ముక్తసరిగా గొణిగి కాంచనవైపు చూడకుండా లోపలికి దూసుకువెళ్ళిపోయాడు. తెల్లబోయిన కాంచన బాల్కనీ అతనికి క్షమాపణచెప్పి భర్తని అనుసరించింది. లోపలికొచ్చిన ఆమెనిపట్టించుకోకుండా బూట్లువిప్పి బట్టలు మార్చుకున్నాడు. కాంచన ఇచ్చిన టీ సిప్‌చేస్తూ పేపర్ చూడసాగాడు. రెండు మూడుసార్లు కాంచనే అతనితో మాటలు కలపడానికి ప్రయత్నించింది. కన్నెత్తయినా చూడకుండా ముక్తసరిగా మాట్లాడాడు అతనిలో ఈ విపరీత మార్పుకి దాదాపు స్థంభించిపోయింది కాంచన.

ఏమిటీ మనిషి? కొత్త కాపురం మొదలుపెట్టి పట్టుమనిపదిహేనురోజులు నిండలేదు. అందులో సగంరోజులు ప్రభాకర్ మూతి బిగింపులోనే గడిచిపోయాయి. అలకకైనా అర్థం వుండద్దు? కారణం అవసరం లేదా? పోనీ పొరపాటేదైనా జరుగుతే మొహం మీద అడగొచ్చు కదా? అత్తగారిలాగా ఈ మూగ సాధింపేమిటి? మొదటిసారిగా

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





## మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

### రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన నాలుగు నూనెల సమ్మేళనం—

హాపుషా (దేవదారు జాతి), లవంగ పట్ట, లవంగ, సరళం.

రెక్సోనాతో స్నానం
చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది.
మీరెంతో ఇష్టపడే
పరిమళాన్ని చర్మంపై
నిలిపి గుబాళింపజేసే
రెక్సోనా మీ చర్మ
సంరక్షణ కోసం
సహజమైన సాధనం.




## రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-RX.78-4710 Tl.

అతని అర్థంలేని చేష్టలకి కాంచనకి కోపంలాంటిది కలిగింది

రెండురోజులు గడిచాయి. తిరిగి మామూలు మనిషయ్యాడు ప్రభాకర్

ఈసారి ప్రభాకర్ దగ్గరకి వచ్చినా మనస్ఫూర్తిగా మాట్లాడలేక పోయింది ఆమె ఎందుకలా సాధించారని అడగాలని నాలిక చివరిదాకా వచ్చింది బలవంతాన అణుచుకుంది కాంచన. అడగ బుద్ధి వెయ్యలేదు.

మరో నాలుగురోజులు గడిచాయి ఒకరోజు ఆదివారం

కాంచన, ప్రభాకర్ సినిమాకెళ్ళారు. టికెట్లు తీసుకురావడానికి ప్రభాకర్ వెళ్ళాడు అతనటు వెళ్ళాడో లేదో గిరి ప్రత్యక్షమయ్యాడు కాంచనముందు గిరి చాలా యాక్టివ్ అందరితోటి ఎంతో కలుపుగోలుగా వుంటాడు ఎవరికైనా వుపకారం చేస్తాడు కాని అపకారం అంటే గిట్టని మనిషి

ఆమెతో గలగలా మాట్లేస్తున్నాడు గిరి. అతని ఎదురుగా వున్న వాళ్ళెవరూ ఒక్క అయిదు నిముషాలకంటె ఎక్కువ నవ్వకుండా ఉండలేరు. నవ్వుతూ వింటోంది కాంచన. మరో పదినిముషాలకి టికెట్లు తీసుకొచ్చిన ప్రభాకర్, గిరి, కాంచనలు సంభాషణ లహరిలో అతన్ని గమనించలేదు. రెండు క్షణాల తర్వాత తలతిప్పిన కాంచన వులిక్కిపడింది అయిదారడుగుల దూరంలో నిలబడి తీక్షణంగా చూస్తున్నాడు. ఆ చూపులో ఈర్ష, కోపం, అసహనం కలగా పులగంగా వున్నాయి. పెదాలు బిగిసిపోయాయి.

అంతే.... కాంచనకంతా అర్థం అయిపోయింది. ఇన్నిరోజులు అతని అర్థంలేని కోపానికి అర్థం తెలిసి పోయింది కాంచన తప్పు చూపిందని గమనించి, తన్నితాను సంభాళించుకుని వాళ్ళదెస అడుగువేసాడు పిక్చర్ బిగిన్ అయ్యేసమయానికి గిరి వెళ్ళి పోయాడు. కాంచన వూహించినట్లు గానే అతను ముభావంగా వుండి పోయాడు.

మరో మగాడితో మాట్లాడ్తే సహించలేని బలహీనత అతనిలో బలంగా వూడలు వేసివుందని గ్రహించింది. అందుకే ఆరోజు రిసెప్షన్‌లో గిరి కన్పించాక, రెండోసారి బాల్కనీలో అతనెవర్తోనో మాట్లాడాక అతని మౌనవ్రతాల ఫలితాలు తను చూసింది. మళ్ళీ ఈరోజు అదే రిపీట్ అవుతోంది. ఓరి భగవంతుడా ఇంత చదువుకుని, ఇంత పెద్ద వుద్యోగం చేస్తూ, ఇంత మహానగరంలో తిరుగుతూ, సంస్కారవంతులైన బడే పెద్దమనుషులమధ్యలో వుంటూ ఇతనికింత ఇరుకు మనస్సు ఎలా వచ్చింది ?

తనూ చదువుకుని, వుద్యోగం చేస్తోందే... మగవాళ్ళతో మాట్లాడకుండా వుంటుందని ఎలా వూహించగలడు? తను ఆడపిల్లలతో మాట్లాడకుండానే వుంటున్నాడా? అతనిలో మరో బలహీనం కూడా చూడగల్గింది కాంచన. ఇలాంటి వాళ్ళు పైకి ఎంతో సంస్కారవంతుల్లాగా, ఎంతో వున్నత భావాలుగల వాళ్ళల్లాగా ప్రవర్తించటానికి ప్రయత్నిస్తారు. కాని తమదాకా వచ్చే




సరికి మడిబట్ట కట్టుకుని తనవారు వుండాలని కసీసంగా కోరుకుంటారు. పైకి మాత్రం చెప్పుకోడానికి అందమైన భార్య, బాగా చదువుకున్నది, వుద్యోగం చేస్తున్నది కావాలి....

కాని షోకేసులో బొమ్మలాగా వాళ్ల అనుకున్నట్లుగా, వాళ్ళ ఇష్టానుసారంగా ప్రతి కదలిక వుండాలి. లేకపోతే సహించలేరు. పైకి కక్కలేరు మింగలేరు. ఇలా మనసాధింపులు సాధిస్తారు.

రెండోరకం-సూటిపోటీ మాటలతో జీవితాన్ని నరకప్రాయం చేస్తారు. ముందు ముందు తన జీవితం ప్రభాకర్‌తో ఎలా వుండబోతుందో వూహించుకో గల్గిన కాంచన మనస్సు ఒక్కసారిగా గడ్డకట్టుకుపోయింది. ఇలాంటి మనస్తత్వంతో కాపురం తల్చుకుంటె ఆమె మేను జలదరించింది.

ఏం చెయ్యాలి తను? దీనికేదైనా పరిష్కారం వుందా? పోనీ వుద్యోగం మానేస్తే దాంతో తృప్తి పడ్తాడా ప్రభాకర్? ఊ హు ... ఇలాంటి మనుషులకి బయట ప్రపంచంలో 'షో' లు ఎక్కువ చేస్తారు. తన భార్య ఆఫీసర్ అనైనా చెప్పుకోడానికి తన వుద్యోగం మానవియ్యడు.

ఇలాగేపరపురుషుడితో మాట్లాడినప్పుడల్లా మూగనోముతో సాధిస్తుంటాడు. భగవాన్....చివరికి నన్నిలాంటి మనిషిపాల పడేశావా? కాంచన మనస్సు ఆక్రోశించింది అందం, చదువు హోదా వున్న తన జీవితం ఎంతో ఆశాపూర్వకంగా నిండుగా వుంటుందని ప్రభాకర్ రాకతో మనస్సుని తను పూర్తి నిర్లిప్తత ఆవరించగా, కలత చెందిన మనస్సుని సంబాళించుకోడానికి వ్యర్థ ప్రయత్నంచేసింది ఆఫీసర్ కాంచన ★

# కల్లోల గౌతమి

## లల్లాదేవి

తానింక వాదించినా తల్లి అంగీకరించదు. పైగా తనమనసు మార్చేందుకు ఇంకా బలీయమయిన ప్రయత్నం ప్రారంభిస్తుంది. అందునుంచి అలాగే "అమ్మా! నేను ముందుకు పోతాను నువింక వెనుతిరిగి వెళ్ళిపో" అని చెప్పి అశ్వాన్ని అదిలించింది తుల్యభాగ. అది త్వరితగతిలో పరుగు తీయటం ప్రారంభించింది.

తల్లి చెప్పిన హితవచనాలు మనసుపొరల్ని చీల్చుతున్నాయి. ప్రకృతి నిర్దేశితాలయిన స్త్రీత్వం తాలూకు సున్నితమయిన స్పందనలేవో చెలరేగుతున్నాయి. హిమగిరి శిఖరాగ్రాన రవికిరణం సోకి కరిగించే మంచు బిందువులా అంతర్యంలో ఎక్కడో ఒదిగిపోయిన ఆశలు ఉవ్వెత్తున లేస్తున్నాయి.

ఉద్విగ్నత హృదయమంతా క్రమ్ముకుంది.

రవంత పరధ్యానంతో అశ్వాన్ని అదిలించటం మరచిపోయింది తుల్యభాగ. అది పైరుపచ్చని పొలాలమీద పచ్చిపచ్చి వాసనలు పీల్చుతూ మందగతిన పోవటం ప్రారంభించింది.

### జరిగిన కథ

బానిస స్త్రీ పురుషుల నిజజీవిత వైపరీత్యాలని విశదంగా విమర్శించిన తుల్యభాగ- వైశాలీ నగర స్త్రీకి శమంతుడి నుంచీ విముక్తి కల్పించాలని భావించింది- ఉత్తరక్షణం శమంతుడు తుల్యభాగని మట్టుబెట్టదలచాడుగాని తుల్యభాగ ఎవరి పుత్రికో స్పష్టంగా విదితమయిన తక్షణం ఆ పనిచేయ సాహసించలేక సగౌరవంగా తుల్యభాగను పంపివేశాడు తగుమాత్రం హెచ్చరిక పొంది. తుల్యభాగ తల్లిని దర్శించి వివాహప్రసక్తితో వెనుతిరిగింది, శ్రేయోరాజ్య బాధ్యత తల్లికి విడమరచి చెప్పి.

రవంతదూరం పోయాక మరొకవ్యక్తి వచ్చి ఆమెతో కలిశాడు అతడు కన్పించిన వ్యక్తితో సంభాషించేందుకే అన్నట్టుగా వేగంగా పరుగుతీస్తున్న గుర్రాన్ని కళ్లెంపట్టి ఆపాడు.

తల త్రిప్పి ఆజనివంక చూచింది తుల్యభాగ.

ఆకృతినించి అతడు శబరగణాలకు చెందిన వ్యక్తిగా గుర్తించిందామె దక్షిణపు దిక్కునించి వచ్చి తనతో కలిశాడు అందునించి తన ఊహ సరి అయినదే అని నిర్ణయించుకుంది.

"నీవు యక్షగణాలకు చెందిన యువతివి కాదా?" అని అడిగాడు,

"అవునవును. నేను యక్షుల యింటి ఆడబడుచును. మరి నీవు ఎక్కడ నించి వొస్తున్నావు?" అని అడిగింది తుల్యభాగ,

"శబర గణాలనుంచి."

"ఎందాకా పోతున్నావు?"

"యక్షుల గణాధ్యక్షుడయిన కుండాలకుని చూచేందుకు పోతున్నాను" అ బదులిచ్చాడతడు.

"ఓహో! వారితో నీకేమిటి పని?" అని ఏమీ ఎరుగనిదానిలా ప్రశ్నించింది తుల్యభాగ. అతడు ఈ ప్రశ్నకు బదులు యిచ్చేందుకు రవంతగా సంశయించాడు.

"శబరగణాలనించి ఒక వర్తమానం తెచ్చాను" అన్నాడు వివరించి చెప్పటం అంతగా యిష్టంలేదన్నట్లు కంఠస్వరాన్ని మార్చి

"శాబరులంతా సుఖసంతోషాలతో ఉన్నారు కదా! పరదేశీ! కాయకష్టం చేయటంలో యక్షగణాల వారికన్నా శబరగణాలవారే అధికులని నేను విన్నాను. నిన్ను చూస్తే శబరులు మంచి శారీరకశక్తిసంపన్నత గలవారు అని తెలుస్తోంది. కుండాలకుని నీవు ఇదివర కెప్పుడయినా చూశావా?" అని అడిగింది తుల్యభాగ.

అతడు గతాన్ని స్మరించాడు.

"నా బాల్యంలో నా తండ్రివెంట ఒకసారి వారిదగ్గరకు వచ్చాను. శమంతుడనే బిడారువ్యాపారి ఒకడు ఉత్తరాది రాజ్యాలనించి ఏవో మాయవస్తువులు తెచ్చి మా శబరులను మోసగించాడు. వారినించి అధికధనం సేకరించాడు."

శబరగణాల అధ్యక్షుడయిన నా తండ్రి అది సహించి దేశద్రిమ్మరులైన లయిన వ్యాపారులను హింసించటం మంచిది కాదని ఉపేక్షించి ఊరుకున్నాడు

అది అలుసుగా తీసుకుని శమంతుడు కొందరు అమాయకులయిన తల్లిదండ్రులను ప్రలోభపెట్టి కొందరు శబర యువతుల్ని బానిసలుగా సమీకరించాడు.

వారిని ఉత్తరాదిన సేవకావృత్తిలో నియమించేందుకు తీసుకు పోతున్నా డన్న వార్త నా తండ్రికి తెలిసింది అప్పటికే శమంతుడు కృష్ణాతీరం చేరు కున్నాడు. యక్షగణాలలో ధనాన్ని ఆర్జించే నిమిత్తం ఎక్కడ బిడారు దింపుకు న్నాడు

అది తెలిసి నా తండ్రి కుండాలకుని సహాయం అర్థించేందుకై వచ్చాడు. ఆప్పుడు నా తండ్రివెంట నేనుకూడా ఉన్నాను. వారి సాయ తోనే శమంతుని బాగా బుద్ధిచెప్పి బానిసలుగా బంధించబడిన యువతులందరినీ విడుదలచేయించాడు నా తండ్రి అప్పుడు నేను కుండాలకుని చూచాను యక్షగణాలలో వారి మాట తిరుగులేనిది అని నాకు తెలుసు" అన్నాడు

"శమంతుని దుశ్చర్యలు ఈనాటివి కావన్న మాట" అన్నది తుల్యభాగ

అతడు ఔనని తల ఊగించాడు

"ధనకాంక్షతో శమంతుడు వక్రబుద్ధి అయినాడు అతని ఆగడాలు నానా టికీ మితి మీరుతున్నాయి" అనాడు తీవ్రస్వరాన. ఆ మాటలు అంటున్నప్పుడు అతని కన్నులు ఎర్రవయినాయి.

వారిమధ్య ఈ సంభాషణ కొనసాగుతూ వుండగానే యక్షుల నివాసాలకు పొలిమేరలు వచ్చాయి అశ్వాలను మరికొంచెం చురుకుగా పరుగు తీయించారు నడుస్తున్న సంభాషణ ఆగిపోయింది. ఇంటికి వచ్చాక మెరుపులా గుర్రంమీది నుంచి క్రిందికి దిగింది తుల్యభాగ అతడు సంశయాత్మకంగా నిలిచిపోయినాడు.

"పరదేశీ! నీవు మా అతిథివి ఇది నా స్వగృహమే అనుకుని లోపలకు వచ్చెయ్యి- ఇదే కుండాలకుని యిల్లు యక్షగణ అధ్యక్షులు ఇంటిలోనే వుంటారు ఆ ప్రక్కగా ఉన్న అశ్వశాలలో నీ గుర్రానికి విశ్రాంతిని ఇవ్వు

నీవు తిరిగి వెళ్లేవరకూ అశ్వరక్షకులు దాన్ని చూచుకుంటారు. నీవు నిశ్చిం తగా నాతోపాటు లోపలకు రావచ్చు" అంటూ ముందుదారి తీసింది తుల్యభాగ ఆమెను అనుసరించాడు శబర ప్రతినిధి

ఆమె కుండాలకుని తనూభవ అన్నవిషయాన్ని అతడంతవరకూ గ్రహించ లేదు తుల్యభాగ చెప్పనూ లేదు.

కుండాలకుడు వారికి ఎదురు వచ్చాడు నవాగతుడయిన యువకునికి స్వాగ తం పలికి లోపలకు తీసుకుపోయినాడు.

తుల్యభాగ అతనికి అతిథి మర్యాదలు చేసేందుకు లోపలకు వెళ్ళింది

"నాయనా! నీ రూపు చూస్తే శబరగణాలకు చెందిన వ్యక్తిలా కన్పిస్తున్నావు. నీవేమీ సంశయించకు. ఇది నీ స్వగృహమే అనుకో! శబరులు మాకు సోదరులే! నీవు చిన్నవాడవు. నీకు తెలుసో తెలియదో కాని శబరగణాల అధ్యక్షుడు నాకు మంచి మిత్రుడు అతడు ఆరోగ్యంగా ఉన్నాడా?" అని ఆదరాస్వరాన ప్రశ్నించాడు కుండాలకుడు.

వెంటని శబరయువకుని నేత్రాలు అశ్రుశిక్తమయినాయి. అతడు శిరసు వంచి తన దుఃఖభరాన్ని నిలువరించుకునే ప్రయత్నం చేశాడు. "చిన్నయ్యగారూ! నా తండ్రిగారు మరణించి కొద్దికాలమయిపోయింది. ఇప్పుడు వారి స్థానంలో నేనున్నాను. శబరగణాల విశ్వాసం నా తండ్రిమీద నిలిచినట్లుగానే నామీద కూడా నిలిచింది. నా తండ్రి ఇహలోకయాత్ర చాలించగానే వారు నన్ను తమ అధ్యక్షుడుగా నియమించుకున్నారు.

ఆ విశ్వాసాన్ని నిలుపుకోవలసిన బరువు బాధ్యతలు నా మీదున్నాయని, మీతో కొన్ని విషయాలు మాట్లాడేందుకు వారి ప్రతినిధిగా నేను వచ్చాను" అన్నాడు విశ్వాసపూర్ణమయిన స్వరాన.

"నా కుమారీ నీవూ ఎక్కడ కలిసారు?" అని అడిగాడు కుండాలకుడు,

ఆమె ఈతని తనూభవ అన్న విషయాన్ని అప్పుడు గ్రహించాడు శబరయువకుడు, శారీరకమయిన శక్తిసంపన్నత; ధైర్యమూ ప్రస్ఫుటంగా ద్యోతకమవుతున్న ఆతని ముఖంలో చిరునవ్వు వెన్నెలలు కన్పించినాయి.

"నా మార్గంలో కన్పించి ఆమే నన్నిక్కడకు చేర్పించింది. ధైర్య సాహసాలతోపాటు మంచితనమూ, శౌర్యపరాక్రమాలతోపాటు సద్బుద్ధీ కలిగిన అటువంటి యువతిని నేనిదివరకెన్నడూ చూడలేదు. మా శబరగణాలలో కూడదు అంటూ నవ్వాడతడు.

కుబురుమీసాల మాటున గుంభనగా నవ్వుకున్నాడు కుండాలకుడు. రవంత సేపు అయాక అతడు ఏదో చెప్పాలని ప్రయత్నించాడు. కాని అంతలో తుల్యభాగ అక్కడకు వచ్చి చేరడంతో వారిరువురిమధ్య సాగుతున్న సంభాషణకు అంతరాయమయింది.

  

యక్షుల ఆవాసానికి ఆవలగా కృష్ణాతీరానికి చేరువగా యక్షగణాలన్నీ సమీకరించబడినాయి, దగ్గరప్రాంతాలలో నివాసముంటున్న నాగులు కూడ కొందరు అక్కడికి వచ్చి చేరారు.



యక్షగణాలు చర్చలు జరిపేందుకు పరిషత్తు సమావేశం కావాలని పిలుపు యిచ్చాడు కుండాలకుడు.

కృష్ణాతీరం జనసంకీర్ణమయి పోయింది ఎంతో అవసరమయినప్పుడె ప్రధానమైన సమస్యలు తలఎత్తినప్పుడే ప్రజలకు పిలుపు యిస్తాడు కుండాలకుడు.

సాధారణ సమస్యలను పరిషత్తు సభ్యులుగా ఎంపిక కాబడినవాడు సమావేశమై చర్చిస్తారు నిర్ణయాలు తీసుకుంటారు కాని జటిలమయిన సమస్యలు, అందరికీ తెలియవలసిన విషయాలు ఉన్నప్పుడు ప్రజలకు కూడ పిలుపుయిస్తారు

వారి ఎదుటనే చర్చలు జరుగుతాయి.

అప్పటికప్పుడే పరిషత్తు సభ్యులకు పరిషత్తులో మహాజనులు చెప్పే అవకాశ ముంటుంది. వారి నిర్ణయాలను అవసరమయితే ప్రజలు సవరించే అవకాశ ముంటుంది,

ఖబరులు ప్రతినిధిగా వారికి అధ్యక్షుడయిన యువకుడు చెప్పిన సమాచారమంతా విన్న తరువాత అందరిని సమావేశ పరిశ విధంగా నిర్ణయించాడు కుండాలకుడు

ఈ ప్రొద్దె ఆ సభలు జరుగుతున్నాయి.

పరిషత్తు మహాజనులయిన ప్రజలు పరిషత్తు ప్రతినిధులు గా ఎంపిక కాబడిన సభ్యులను కాని అధ్యక్షుడయిన కుండాలకుణ్ణి కాని తమకు ఇష్టం వచ్చినప్పుడు దింపి వేయవచ్చు.

ఆ అవకాశం వారి కుంటుంది,

కాని కుండాలకుడు పరాక్రమశాలి. తెగువరి, అంతే కాక మేధావి. జాతి జనుల శ్రేయః కామనకై రాత్రింబవళ్లు పరిశ్రమించే తత్త్వం కలవాడు, అట్టివాడు కావటం నించి అతనిని దింపే అధికారం అవకాశం పరిషత్తు మహాజను లకు ఉన్నా అతడు జీవిత కాలమంతా అధ్యక్షుడుగానే ఉండగలిగాడు.

అతడు పిలుపు నివ్వాడవగానే తగిన కారణమేదో ఉండే ఉంటుందని వారంతా అధికసంఖ్యలో తరలి వచ్చారు. మహాజనులంతా వచ్చిచేరిన కొద్దిసేప టికి పరిషత్తులోని సాధారణ సభ్యులువచ్చి తమ తమ ఆసనాలలో కూర్చున్నారు.

రంగురంగుల నారచారలు ధరించివచ్చిన జనులమధ్య తుల్యభాగ తన మిత్రమండలితో కలిసి తిరుగుతోంది అందరినీ చిరునవ్వుతో పలకరింతుతోంది.

కొందరికి ధైర్యవచనాలు చెప్తోంది కొందరి పాదాలకు కుదురు తాకించి నమస్కరిస్తోంది. కొందరిని కొడిగాలు చేస్తోంది. అందరి మధ్య ఆమె చుక్కల మధ్యలో చందమామలా కన్పిస్తోంది.

తమ అధ్యక్షుని తనూ భవ అన్న ఆదరమే కాక స్వతః సాహసి సౌజన్య మూర్తి అయిన ఆమెను ఎవరితో గౌరవిస్తారు యక్షులు. పెద్దవారు ప్రమాద రాలతో చూస్తారు.

ఐరావతి మహాదేవుడు ఆమె పొలకువ విడిచి ఒక్క క్షణమయినా ఉండ లేదు. ఇప్పుడామె వెంటనే ఉన్నారు.

తుల్యభాగ కన్పించగానే ఎంతో ఆదరంతో ప్రేమతో పలకరించే మహా జనులమధ్య ఎంతో సంబరపడి పోతోంది ఐరావతి. తన అక్కకు జరుగుతున్న మర్యాదలు లభిస్తున్న ప్రేమ ఆదరాలు అన్నీ తనకే జరుగుతున్నాయా అన్నంతగా సంబరపడి పోతోంది ఆమె.

రవంతసేపు అలా మహాజనుల మధ్య తిరిగాక వారిమధ్య ఏదో సంచలనం రేగటం గుర్తించింది తుల్యభాగ అనుకుంది నాన్నగారు వొస్తున్నారు కాబోలు.

తలత్రిప్పి చూచిందామె.

శబర గణాల యువకుని వెంటపెట్టుకుని పరిషత్తు సభ్యులు అధ్యక్షుడు కూర్చునేందుకు వీలుగా ఏర్పరచిన ఎత్తయిన వేదికమీదికి వస్తూ కన్పించాడు




"టీ.వి మీద మనం కనిపించాలంటే ఏమయినా మార్గాలున్నాయా?"

"ఓ-దానిమీదెక్కి కూర్చోవడమే."



తండ్రి. అతడు వయోభారంవల్ల మెట్లమీదుగా ఎక్కేందుకు ఆయాస పడిపోయి వగర్చుతూ ఉంటే చెయి ఆసరాగా అందించాడు శబరయువకుడు.

వేదికమీదికి చేరాక అతనిన్ని గౌరవ సూచకంగా వేదికమీద ఉన్న ఎంఎ కయిన పరిషత్తు సభ్యులు లేచి నిలిచారు. కుండాలకుని చూడగానే మహాజనులు గౌరవసూచనగా హర్షధ్వనాలు చేసారు.

అందరికీ అభివాదాలు చెప్పిన తరువాత మాట్లాడటం ప్రారంభించాడు కుండాలకుడు. అతడు నోరువిప్పగానే జనసాంద్రమయిన కృష్ణాతరం నిశ్శబ్ద మయిపోయింది

తలపూవు క్రిందపడిపోయినా విన్పించేటంత నిశ్శబ్దం!

"సోదరులారా! అందరికీ అభివాదాలు.

ఈ పవిత్ర కృష్ణవేణి సలిల ధారలతో పునీతమవుతున్న దక్షిణాది భూములే మన తాతలు తండ్రులకు జీవనాధారమయినాయి. నాగులు ఇక్కడివారే యక్షులకు పూర్వులు బహుకాలానికి పూర్వం ఉత్తరాది భూములనించి తరలివచ్చి ఇక్కడ ఆయానమంటున్నారు.

ఆర్యులతో విభిన్నమయిన రక్తంమాది.

అందునించి దక్షిణ ప్రాంతాల జనుల మధ్య నెలకొనిపున్న నాగరికత మా పూర్వీకులను ఆకర్షించింది. ఏది ఏమయినా యక్ష జాతికి మాతృభూమి ఈ దక్షిణాపథమే!

అందునించి పవిత్రమయిన ఈగాలి ఈనేల ఈనీరు మనకు ప్రాణప్రద మయినవిగా భావించుకొంటున్నాము

ఇక్కడి జీవన విధానం ఔత్తరాహులకు భిన్నమయినది దక్షిణాపథంలో వ్యవసాయము వేట ప్రధానమయిన వృత్తిగా మనమంతా జీవిస్తున్నాం. ఆర్యులు వలె మనం లోకసంచారులము కాము. స్థిరనివాసాలతో వర్ధిల్లుతున్న జాతి మనది.

ఆర్యులు యుద్ధ విద్యావిశారదులయినా సామ్రాజ్య విస్తరణ కాంక్షాపరులు వారు విద్యాధికులయినా స్వార్థపరులు శాంతి కాముకులయిన మునులు పవిత్రులే కాని ఆర్య పక్షపాతులు

వృత్తిరీత్యాలో కసంచారులూ, ప్రవృత్తిరీత్యా స్వార్థపరులూ, చపల చిత్తులూ అయిన ఆర్యులు ప్రశాంతంగా సుసంపన్నంగా ఉన్న దక్షిణాది భూము లపై కన్నువేసారు.

అనేక మారులు దండయాత్రలు చేసి యిక్కడి సంపదలు దోచుకు పోయారు. అనేకమార్లు దక్షిణాపథం వారే వారికి బుద్ధిచెప్పి త్రిప్పికొట్టారు. అయినా వారి ఆశ చావలేదు.

ధనకాంక్ష ఎప్పటికీ బెదరనిది. అది చిరంజీవి అవకాశం దొరికినప్పు డల్లా అది చిగుర్చి మొగ్గలు కోడుగుతుంది.

అటువంటి స్థితి తిరిగీ మనకు ఎదురవుతుంది.

మనలో కొందరు ధన కాంక్షలతో ఆర్యరాజులకు బానిసలయినవారున్నారు వారివల్ల మనకు ముప్పు వాటిల్లుతోంది ఆర్యుల కదలికను సుదీర్ఘమయిన నా జీవిత కాలంలో నేను బాగా గమనించాను. వారికి సుసంపన్నమయిన భూము లను జయించాలన్న ఉబలాటం అధికం.

అలా జయించేందుకు రాజనీతి పేరుతో చెల్లుబాటు అవుతున్న కుట్రలు జరపటం వారి ఆనవాయితీ! అది నాకు బాగా తెలుసు. మీలో కొందరికి తెలుసు.

అడవి తగలడిపోయి భస్మరాసి అవటం మనం ఎన్నోసారులు చూదాం. అలా మంటలు చెలరేగటానికి ముందు పొగరాజుకుంటుంది. పొగరాజుకుం టున్నదంటే ముందు ముందు మంటలు అడవిని భస్మం చేస్తాయనేకదా అర్థం!

అలాగే ఆర్యులు దండయాత్రకు పూనుకునే ముందుగా ధూమకేతువుల లాంటివి కొన్ని కనిపిస్తాయి.

అవి ఏమంటే మునివాటికలు నిర్మించటం. బిడారు వర్తకులు అందందు తారాడటం!

మునులు ప్రశాంతమయిన అరణ్య ప్రాంతాలు కావాలన్న మిషతో చొచ్చుకు వస్తారు. ముని వాటికలు నిర్మిస్తారు. వారి ఆలోచనలు అన్నీ పవిత్రమైనవే. జీవన విధానమంతా శాంతిపూర్ణమయినదే ఉన్నదొక్క వక్రమయినా సిద్ధాంతమే.

వారు సర్వదా ఆర్యపక్షపాతులు.

తమ శాంతికాముక మయిన, త్యాగమయిన జీవిత విధానం తో వారు దక్షిణా పథవాసుల్ని ఆకర్షిస్తారు. వీరిలో కొందరికి ఆర్య బుద్ధులు నూరిపోసి ఆర్య పక్ష పాతులుగ మార్చుతారు. ఆతరువాత ఆర్యులు చొచ్చుకువచ్చి దోచుకుపోయేందుకు మార్గం సుగమ అవుతుందన్నమాట.

ఇప్పటి శమంతుకనే బిడారు వర్తకుని రాక అటువంటిదే. బిడారు వర్తకులు ఆర్యుల నాగరికతకు చిహ్నంగా ఉండే అమూల్యమయిన వస్తు సంచయాలను ఎరపెట్టి దక్షిణాది వారిని ఆకర్షిస్తారు. ఉమాయకులు ఆకర్షితులవుతారు.

అంతేకాదు దక్షిణ గణాల స్త్రీలను వారు ఔత్తరాహులకు కానుకలుగా సమర్పించి రాతిరక్తాన్ని కలుషితం చేస్తారు. స్త్రీల శరీరాలను, కళాకారుల ఆత్మలనూ అంగడిలో పెట్టి అమ్ముకోవడమనేది ఆర్యులునేర్పిన అకతాయితనం.

ఈ శమంతుడు వ్యాపారిలా వచ్చి కొందరు శబర యువతుల్ని తీసుకు పోతున్నాడట. వారిని విముక్తి చేయవలసిన బాధ్యత వారి సోదరులుగా మన మీద వుంది.

అతడింతటి దుండగం చేసినందుకు మనమంతా శబరులతో చేయికలిపి సమైక్యంగా ఔత్తరాహుల ప్రతినిధులకు బుద్ధిచెప్పాలి. ఇది మన కర్తవ్యం" అంటూ ముగించాడు కుండాలకుడు. (సశేషం)

## సరదా సరదా సిగరెట్టూ



జె. డబ్ల్యు. కాబెరీనర్ అనే జర్మనుడు 1816 లోనే సిగరెట్ లైటర్ కనుక్కున్నాడు. అప్పటికింకా అగ్గిపెట్టె కనుక్కోలేదింకమరి! అదిగొప్ప.

# మరో ప్రపంచపు ఉషోదయం

"ఆ హిందీవాళ్ళుచూడు, ఎంచక్కా గజదొంగల్ని డాకూల్ని హీరోలను చేసి కథలు వ్రాస్తున్నారో? మీ తెలుగు రచయితలూ ఉన్నారు..." బాధగా దీర్ఘాలు తీసింది కథకుని "అంతరాత్మ"

"ఇప్పుడా డాకూలు గజదొంగటా మన వెంపు లేరుగా! వాళ్ళ కథలు వ్రాస్తే అవాస్తవికంగా ఉండవూ? హిందీ సినిమాలకు మల్లే" కథకుడు సంజాయిషీ చెప్పబోయాడు

"హ ... హ... హ ... " నవ్వి పోయింది "అంతరాత్మ". "గజ దొంగలు, డాకూలు పాతబడిపోయారా? హ...హ...హ...వాళ్లేమన్నా చింత కాయ పచ్చడేమిటోయి, పాతబడి పోవ 'డానికి! మధ్యప్రదేశ్ అడవుల్లో తప్ప



ఆర్.యస్.కె.మూర్తి

మన భాగ్యనగర్ బంగళాల్లో డాకూలకి, గజదొంగలకి కరువు వచ్చేసిందేమి టోయి; పిచ్చివాడా!"

కథకుడికి "అంతరాత్మ" గొడ వేదో కొంత అర్థమైనట్లుంది. "అయితే

ఏవరి సంగతి నువ్వనేది? "అసలైన డాకూలు; నిసలైన గజదొంగల సంగతి కాదా?" నిగ్గదీశాడు.. కథకుడు.

"నే నెప్పేది నిజమైన డాకూలు, అనుమానంలేని గజదొంగల సంగతే! నీలాంటి సామాన్యుల చుట్టూ పద్మ వ్యూహం పన్నిన సిసలైన సరుకు సంగతే చెప్తుంట! రాయి... వాళ్ళ కథలే రాయి. పాడు సెంటిమెంటల్ స్టఫ్ పదిలేయి." దండిగా ప్రోత్స హించింది. కథకుని "అంతరాత్మ".

* * *

"మార్నింగు సర్"

టెర్లినుపాంటు... గళ్ళచొక్కా... చేతికో స్మగుల్డువాచి అందంగా చురుగ్గా ఉన్న యువకుడు. బెరుగ్గా; అనీజీగా వచ్చి "ఆయన" ముందు నిలబడ్డాడు, అభివాదం చేస్తూ.. చీమ గొంతుతో, దోమ ధైర్యంతో.

"ఆయన".! అంత పెద్దాయన! ఆయనేమో పేపరు చదవడంలోనే మునిగిపోయి కూర్చున్నాడు.

టెర్లిను హెలాకింకా తెలియదల్లే ఉంది... అంత పెద్ద బంగళాలో ఉంటూ ఇంతింత పెద్దకార్లలోతిరిగే "ఆయనలు" తాను మార్నింగుసర్ అన్నంత మాత్రాన ముఖమెత్తి చూడ రనీ. పన్నువిప్పి పలకరనీ. తమబోంట్ల మీద కృపా కటాక్ష దీక్షణాలుకుపించ రనీ. తెలియనితనంవల్ల కంగు తిన్నట్లు న్నాడు.. యువకుడు.

అబ్బ.. ఎంత పెద్ద బంగళనో! జామెట్రీని ధిక్కరించే ఆకారం. కోటీశ్వరుల్ని ధిక్కరించే వైభవం!

బంగళకంటె వైభవంగా ఉంది.. దానిచుట్టూ ఉన్న లాన్అంతకంటె అందంగాకూడ ఉన్నదా లాన్!

లాన్‌కంటె అందంగా ఉన్నాయి దాని మధ్యనిలిచిన సోఫాలు, కుర్చీలు. అందమేకాదు అవెంతో హుందాగా కూడా ఉన్నాయి.

ఆ కుర్చీ[illegible], సోఫాలకంటె[illegible] హుందాగా [illegible].. వాళ్[illegible] కూరుకుపోయి; పేపర్[illegible] మునిగి రాయన "ఆయ[illegible]" పె[illegible] లపు మించిన [illegible] సిగరెట్[illegible] జల్లుతున్నాడు.. [illegible] ప్రొద్దున్నే. ఏవో వాసనలు [illegible]; [illegible] ఉన్న వాసనలు. [illegible] వారికి చీమగొంతుతో దోమధైర్యంతో చెప్పిన "మార్ని[illegible] స[illegible]" [illegible]స్తుందా!

వినిపించదని [illegible], టెర్లిను వాలాకి.

చదువుకొంటున్న కొడుకుని భావి ఉద్యోగిగా ఊహించుకొని; తల్లి తండ్రులు కుట్టించి యిచ్చి టెర్లిన్‌లు చిరుగులు పడనంతవరకు యువకుల కిటువంటి వాస్తవాలు అర్ధంకావు. నిరు ద్యోగిగా స్థిరపడి పైజమాలోకి మారితేనేతప్ప వాళ్ళకీ విషయాలు వంట బట్టవు. అవునా?

కావటానికీ పెర్లినువాలా మన కథలో హీరోనే! అయితేనేం అన్ని కుర్చీలు అక్కడుంటే తనను కుర్చో మని ఆయనెందుకు అనునయించడో ...పోనీ తానే ఒక కుర్చీలో ఎందుకు కూర్చోలేడో అర్థంకాలేదు. యువకునికి. అయోమయంలో ఆ బంగళవంకా; ఈ కుర్చీలవంకా చూస్తూ ఉండిపోయాడు. అసలైన డాకూలు; సిసలైన గజ దొంగల కథలో హీరో!

* * *

"అయ్యగారేదో తీరిగ్గా...హి... హి...హి..." నవ్వుతూ వచ్చి అంత లావు పెద్దాయన ముందు కుర్చీలో కూర్చున్నాడొక ఎర్రటి గండుచీమ లాంటి మధ్యాయన. అంతలావు శేడు గాపీ తెచ్చిన సంచి అకత లావుగావుంది.

అంతలావు సంచీవంక ఆశగా చూడ కుండా ఉండటం అంతలావు పెద్దాయ నకు చేతనైనట్లులేదు. ఎంతగా పేపర్లో మునిగిపోదామన్నా, కళ్లు సంచినికాదని కాగితాలను చూసేట్లులేవు. రక్తం వాసన తగిలిన తోడేలు పురాణాలు ప్రక్కన పెట్టినట్లు;. పేపరు ప్రక్కకు వేసేశాడు- పెద్దాయన. ఎక్స్రేకళ్ళుఏదోచూసేసినై.

"ఆ- అయితే మళ్ళీ పెద్దపనిమీదే వచ్చావన్నమాట" పేపరు వదిలినకళ్ళు పత్తికాయల్లా సంచిమీద విలిచిపోయినై.

"చిత్తం చిత్తం. పెద్దపనికాకపోతే తమదాకా...హి...హి...జిల్లాలోకర్వువు క్షామం ... కాటకం, తాండవించి ... ష్...ష్... తిండికిలేక త్రాగడానికి లేక జనాలు...అదే అల్లాడిపోతున్నారు. ప్రభువులవారు దయతలచి ఏదోఒకటి చెయ్యకపోతే...ష్...ష్" ఏవాక్యం పూర్తిచేయడం అలవాటు లేనట్లుంది- ఎర్రగండు చీవుకు.

[ప్రజలకోసం ఇట్లా తపిస్తున్న మానవుడు- కుర్రాయన... అదే పెర్లినీ వాలా...మనసు కరిగిపోయింది.]

"ఏం చెయ్యాలంటావు; ప్రభువుల వారిని? కొంపతీసి ఏ ప్రాజెక్టులన్నా కట్టించి; సాగుబడి భూమి పెంచా లంటావా? కాపోతే గ్రామీణ ప్రాంతాల్లో ఏ పరిశ్రమలో పెట్టించి ఉద్యోగాలు పెంచమంటావో" పెద్దాయన వ్యంగ్యాలు విసిరారు.

"అమ్మమ్మ" ఎంతమాట...తమరు సెలవిచ్చినవన్నీ ... అవేవో శాశ్వత పరిష్కారాలు... అవన్నీ ఇప్పుడు... హ...హ...హ...ఇప్పటికేదో తాత్కా లిక సహాయం...అదే అదే ... రోడ్లు వేయించడం...రాళ్ళు కొట్టించడం... గంజికేంద్రాలు...ఏదో ఇట్లాంటివే... హి...హి..."

[చక్కటిఆలోచనే-సంతోషించాడు; పెర్లినువాలా]

"హ...హ...హ" అంతేకదా; కొంప దీసి ఈ కరువులు కాటకాలురాకుండా ఏమన్నా చెయ్యమంటున్నావేమో నను కున్నాను. రక్షించావు...హి...హి... హి..."




[నవ్వటం ఎందుకో అర్థంకాలేదు- హీరో యువకునికి. శాశ్వతంగామాత్రం ఈ సమస్యలకేదో పరిష్కారమార్గం ఆలోచించవద్దూ ?]

"చిత్తం...చిత్తం ..కరువులు లేక, కాటకాలులేకపోతే...హి...హి...హి .. మనం కటకట...ప్చ్...ప్చ్, మరైతే ప్రభువులకుచెప్పి ...హి...హి...హి" "నూటొక్క జిల్లా నాయకుడివి కదుటయ్యా ప్రభువులవారితో చెప్పటానికి మళ్ళీ నేనెందుకు ?"

"అమ్మమ్మ...ఎంతమాట...తమరు లేకుండా...హి ... హి ... హి"... "మరైతే ఏమాత్రం సాంక్షను కావాలంటావు?" "ఎంతబాబూ! జిల్లాకంతటికీ పదిలక్షలైతే..." "పదిలక్షలా? తే మరైతే? .. సంచీవంక సాభిప్రాయంగా చూశాడు పెద్దాయన. ఈసారి వాక్యం కత్తిరించడం ఆయన పంతైనట్లున్నది

"చిత్తం. చిత్తం. లక్షా పూరాగా... హి... హి ... హి..." "సర్లె, సర్లె అదంతా తర్వాత చూసుకుందాం" కర్చీఫుతో నాలిక తుడుచుకున్నాడు పెద్దాయన. పెద్దపులి నాలుకతో పెదవులు తుడుచుకున్నట్లు

ఇంతలో అక్కడికొచ్చాడు-సెక్రటరీ.

"ఇదిగో సీతాపతిగారూ, మన గోపాలయ్య అమ్మగారికోసం ధర్మవరం చీరలు...హి...హి... సంచి పట్టుకెళ్ళి అమ్మగారికి...హి...హి..."

,(ఇందాకేదో లక్షా! పూరాగా అన్న

వాడు ఇపుడేమిటి-పట్టుచీరె అంటాడు! అర్థంరావేదు; యువకునికి.]

ఇంతలోనే...అతని కళ్ళకేదో రోగ మొచ్చినట్లు కప్పేసుకుపోయినట్లయింది.

* * *

అదో గుయ్యారపు గుహ. ఇంతంత మీసాలు... ఎర్రటికళ్ళు భయంకరంగా ఉన్న డాకూ నాయకుడు. విలాసంగా కుర్చీలో కూర్చున్నాడు. ఇదేమిటి వాన్‌లో ఉండవలసిన అందమైన; హుందా ఆయన కుర్చీలు గుహలో ఉన్నయ్యేమిటి?

"జీ సర్దర్...పరిగణా అంతా కొల్ల గొట్టుకొచ్చాం. హ ... హ ... హ... లక్ష పట్టేశాం, సర్దార్...అబ్బ జనాలు ఎంత బాగా ఏడ్చారనుకున్నారు సర్దార్! తిండికి లేదని...కరువని...కాటకమని హ...హ...హ...ఇదిగో సర్దార్ లక్ష పూరాగా...హి...హి...హి..."

ప్రక్కవాడొచ్చి అందుకున్నాడు

అదేమిటి ప్రక్కవాడు సీతాపతిలా ఉన్నాడే!

* * *

"మరైతే నేను వస్తాను బాబూ. ఈ కుర్రాయనెవరో ఇందాకటినుంచీ..." ఎర్రగండుచీమ; ఇంకో వావాక్యం కత్తిరించేస్తున్నాడు.

"అబ్బాయి మనవాడేలే. నువ్వెళ్ళిరా" మధ్యాయనను పంపించిన పెద్దాయన అప్పటికి కుర్రాయనవంక పంక చూశాడు.

"ఆ ఏమిటోయి నువ్వా సుబ్బయ్య కొడుకువిగదూ! డాక్టరీ అయ్యావటగా?"

ఓరిలీ; ఇంతసేపూ తనెవరో తెలిసినా, ఇట్లా కూర్చున్నాడా- ఈ పెద్దయన! బెర్లిన్‌వాలా కళ్ళకు రోగం కుదిరినట్లయింది. గుయ్యారపు గుహ దృశ్యం స్పష్టమై పోతున్నది! బెర్లిన్ మడతల్లా స్వచ్ఛంగా ఉన్న యువకుని హృదయం. ఎర్రటి మరకలను వేటినో పులుముకున్నట్లయింది- కొంచెం సేపు.

"అవును సర్. మిమ్మల్ని కలుసుకోమని నాన్న పంపించాడు. ప్రైవేటు ప్రాక్టీసు పెడదామంటే...

"ఆ... ఆ... తెలుసులే; ప్రైవేటు ప్రాక్టీసంటే మాటలా? అసలు మీ నాన్న నీకు మెడిసన్ చెప్పించటమే పెద్ద ఫూలిష్‌నెస్ కాదూ? తేరగా సీటు వచ్చిందని కాకపోతే... ఏ వాక్యమూ పూర్తిచేయటం, చేయనీయటం పెద్దాయనకు ఇష్టమల్లే లేదు.

* * 

డాక్టర్ - "నేను రాసిచ్చిన మందు తిసుకుంటున్నావా?"

రోగి, -"వద్దులెండీ-దానిబదులు దగ్గటమే మంచిదని నిర్ణయించుకున్నను"




కొడుక్కి కష్టపడి చదువు చెప్పించడం మూర్ఖత్వమా? కోపమొచ్చింది హీరో యువకునికి అదే అడుగుదామనుకున్నాడు- ఎన్నోసార్లు కాలరెత్తి లెక్చరర్లను దబాయించిన డాక్టరు కాని డా॥ గోపాలం నిజమైన డాక్టరు కావాలంటే అట్లాంటి ప్రశ్నలు అడక్కూడదని ఎవరో అతన్ని ఒత్తి పెట్టినట్లయింది "ఆన ఎవరికి మాత్రం ఉండదులెండి" అని మాత్రం అనేశాడు- కాలరెత్తకుండానే, కాలరెత్త వలసిన చేతులు భావి ఉద్యోగం కోసం చాముకునే ఉండి పోయినై.

"ఆశ ఉంటే సరిపోతుందిటోయి- ఉద్యోగాలు? ఉద్యోగాలు రావద్దూ? ఈ నిరుద్యోగ సమస్యతో ప్రభువులు ఎంతగా సతమతమై పోతున్నారో తెలుసా? ఎన్ని ఎక్ఛేంజిలు పెట్టించాం? నిరుద్యోగి అంటే ఎవరో నిర్వచించమని కమిటీలు కూడా వేశాంకాదుటయ్యా? అయినా ఏం ప్రయోజనం-ప్రతివాళ్లు చదువులు ఉనోళ్లే గాలు అంటూ ఎగబడుతుంటే..." ఈ సారి వీరావేశమే వాక్యాన్ని త్రుంచేసినట్లుంది.

అందరు ఉద్యోగాలకు ఎగబడక కొందరు కొయ్యలు చెక్కుకుంటూ కూర్చోవాలనా ఈయన ఉద్దేశ్యం? అడుగుదామంటే కాలరు పైకెత్తాలి; అందుకేమో చేతులు చాచి ఉన్నాయి కదా! "మరి నాసంగతి" చీమగొంతు, దోమ ధైర్యం తిరిగొచ్చినై.

"చూద్దాం. చూద్దాం. ఖాళీలు రావాలిగా?"

"రూరల్ డిస్పెన్సరీలు చాలావాటిల్లో డాక్టర్లు లేరుపండీ గ్రామాలకెళ్ళటానికి డాక్టర్లు ముందుకు రావాలిటూ నేనుసిద్ధమే సర్"

"నీ సిద్ధానికేముందిల. కానీ రూర ల్లోకి నీలాంటి వాళ్ళుపనికొస్తారా?

"మీకా అనుమానం అక్కర్లేదుసర్, గ్రామీణ ప్రజలంటే నాకెంతో అభిమా నం నేనువారినెంతో ప్రేమగా..."

కట్!

"అదే. అదే. అందుకే ఆలోచిస్తు న్నాను మీనాన్నా ఇంతే. ఏదో ప్రేమా; దోమా అంటూ పిచ్చిమాటలు మాట్లాడు తుంటాడు. సమాజసోదరులు సింగినాద మంటూ గోలపెడ్తుంటాడు ప్చ్"

ప్రేమ అనురాగం- ఇవి పిచ్చి మాటలా?

సమాజసొదరులు అనటం సింగి నాదమా?

కాదనుకున్నాడు- బెర్లినువాలా. అపు నంటారని అర్థం చేసుకోడానికి- ఏదీ- అతనికిది మొదటి ఇంటర్వ్యూకే కదా!

o o o

మొదటి ఇంటర్వ్యూ మొదలైంది.

"అదిసరే నేనొకటి అడుగుతాను నువ్వో గ్రామానికి డాక్టరుగా వెళ్ళే వసుకో. ఆవైపుకో ప్రజానాయకులు పర్యటన కొచ్చారనుకో అప్పుడు నువ్వేం ప్రోగ్రాం అరేంజి చేస్తావు?

"అదే ముందిసర్; వారికి హృదయ పూర్వకమైన స్వాగతమిస్తాం" హుషా రుగా సమాధానమిచ్చాడు- ప (పి)చ్చి ఉత్సాహం!

"హృదయ పూర్వకంగానా? మరా స్వాగతం వారుస్వీకరించటానికి అదెంత కర్చవుతుందో తెలుసా? ఆ పైసలన్నీ ఎక్కడ తెస్తావు?"

స్వాగతాన్ని హృదయ పూర్వకంగా స్వీకరించటానికి ఖర్చేమిటి... డాక్టరు గోపాలానికి తెలియదు. కాలేజీలో చెప్పే కార్డియాల జీలో ఇటువంటి హృదయాల గొడవ ఉండదు!

అందుకేనోయి నేననేది నీలాంటి వాళ్ళు ప్రభువుల ఉద్యోగాలకు పనికి రాదని. ఆ ఎర్రచీమచూడు... ఎంత కార్యక్రమం ఎత్తుకొచ్చాడో? చూశావుగా"

"ఎత్తేదే ముందిసర్. కరువులు... పాపం కాటకాలు..."

"కరువులా? హ...హో... ఆయనదీ మన ప్రక్క ఊరే మన జిల్లాలో ఇప్పుడు కరువులు క్షామాలు ఉన్నయ్యా హ... హ... హ... చూసైనా నేర్చు

* ఉందిలే మంచికాలం *

మెక్సికోలోని 'ఇన్మ' సామ్రాజ్యకాలంలో ప్రజలందరికి తిండి. బట్ట-ఇల్లు లెదొరికేవట.




కోవాలోయ్ రేపాయన చూడు. ఈ కరువు కార్యక్రమాల ప్రారంభమంటూ, ఎంత ఉత్సవం చేస్తాడో?"

అవును ఎంత ఉత్సవమైనా చేస్తాడు! ఏనాయకుడినో పిలిచి బలిహారాలు పోయిస్తాడు!

ప్రభువుల కొలువు కావాలంటే తనకీ అట్లా బలిహారాలు పోయడం చేతకావాలన్నమాట. ఎర్రదనం నిండింది-పెర్లిన్ వాలా గుండెలో.

'ఛీ ఇంతకంటే ఇంటికెళ్ళి నాన్నతో పాటు కొయ్యలు చెక్కు కోవడమే మంచిది!'

కాని, సున్నితంగా శవాలనుకోయడం నేర్పారేకానీ కరుకుగా కొయ్యలు చెక్కడం తనకు నేర్పలేదే-కాలేజీలో!

హయ్యో! అయితే శవాలను కోసుకుంటూ బతకవలసిందేనా? లేనిపోని రోగాలేవో ప్రబలినవని ప్రభువుల గ్రాంటులు సంపాదించి, పంపకాలు పెట్టుకుంటూ బతకవలసిందేనా? తన కరాలను అవినీతి కంకణాంతో బద్ధం చేసుకోవలసిందేనా? అంతకంటె...?

అంతకంటె చేయదగినదేమిటో తెలియలేదు డాక్టరు కాని డా॥ గోపాలానికి.

అప్పటికీ గ్రామానికి తిరిగివెళ్ళి తండ్రికి సాయంగా కర్రలు చెక్కాలని చూశాడు. చిత్రికవెంబడి కండలు తెగి వచ్చిందేతప్ప, కొయ్య సాపురాలేదు.

లేదు కొయ్యలాఉన్న ఈ లోకాన్ని తాను; సాపుచెయ్యలేడు. జీవం లేని కొయ్యనుండి జీవం ఉట్టిపడే బొమ్మలను

తయారుచేయలేడు. తనలోఉన్నజీవాన్ని చంపుకుని లోకాన్ని నింపిన కొయ్యలలో తానూ ఒక కొయ్యకావడం తప్ప తను చెయ్యగలిగిందేమీలేదు. ఎర్రబడిన గుండె పాలిపోయింది.

*　　*　　*

మెత్తటి ముఖ్మల్ పరచినకుర్చీ; కొయ్యదేనని తెలియలేదు, డాక్టరు కాబోతున్న డా॥ గోపాలానికి.

ఫర్వాలేదు. ప్రభువుల ఉద్యోగాలకు పనికివచ్చేపనులు నేర్చుకుంటున్నాడు, అనుకున్నాడు పెద్దాయన... "నమస్కారంసార్"అంటూ; బుట్ట మధ్యలో పెట్టిన కుర్రాయను.

బుట్టలోకి ఎక్సురే చూపినై పెద్దాయన కళ్ళు పైన పండ్లు- క్రింద బాటిల్సు. ఫారిన్‌వల్లేనేఉంది. ఫర్వాలేదు.

"మొన్న మీరు వేసిన చచ్చుప్రశ్నకు సమాధానం చెప్పనాసార్" మొఖమల్ పరిచిన కుర్చీలో కూర్చున్నాడు. గండు చీమ ధైర్యంతో...హీరోయువకుడు

పేపర్లోంచి కళ్ళు తిప్పకపోయినా, ప్రభువుల ఉద్యోగికాబోతున్న కుర్రాయన పట్టించుకోలేదు ఈ ఆరునెలల్లో కొయ్యకండలు చెక్కుతూ అతగాడు చాలావిషయాలు నేర్చుకున్నాడు. అలాంటి పెద్దోళ్ళు వినకపోయినా అన్నీవింటూనే చూడకపోయినా అన్నీ చూస్తూనే ఉంటారనీ

"ఏంలేదుసర్; సింపుల్...ఏ మహా చికమో మహమ్మారిలా వ్యాపించింది. అని ... నిరోధకం స్కీము పెట్టి ... పర్యటనకొచ్చే ప్రజానాయకులచేత దానికి ప్రారంభోత్సం చేయిస్తేసరి మరిక ఖర్చులంటారా...హి...హి..."

"ఆ...ఫర్వాలేదే"అంటూ బుట్టవంక బుట్టలోని బుడ్లవంక అప్పటికి కన్నెత్తి చూశారు; పెద్దాయన. మనీ, మదిర మగువలవంక ఆశగా చూడడం నేర్చుకోకుండా ఎవరుమాత్రం అంతపెద్దవారు ఎలా కాగలరు ?

"ఇదిగో సీతాపతిగారూ. అయ్యగారి కిష్టమని మానాన్న ఆపిల్సుపంపించారు అయ్యగారి ఏ.సిలో పెట్టించండి. అమ్మగారు...హి...హి...హి..." వాక్యం కత్తిరించాడు, కొయ్యలు కత్తిరించలేని డాక్టరు ! కొయ్యడాక్టరు !

*　　*　　*

చల్లటి సాయంత్రం, మత్తుగా గమత్తుగా ఉన్నగాలి కుర్రడాక్టరు మంచి సరుకే తెచ్చినట్లున్నాడు. ఫర్వాలేదు. ఇంత చక్కటి సాయంత్రం ... అంత చక్కటి సరుకు...ఇంకింతచక్కటి... పులిపెదవులు తడుపుకొంటూండగా...

"గుడ్ ఈవెనింగు సర్"

మనిషి వికారంగాఉన్నా పలకరింపు కంటె షోగ్గానేఉంది- వెంబడివచ్చిన పడతి.




పేపరును వదిలివచ్చిన పెద్దాయన ఎక్సు రేకళ్ళు ఆ పడతి చీరెమడతల్లో; రెవిక గుండిలలో దాచుకున్న అందాలను వెలికిలాగసాగినై.

"ఈమె నా ఫ్రెండు సర్. ఓల్డు క్లాస్‌మేట్; ఈ మధ్యనే అమెరికా అదీ వెళ్ళివచ్చింది. గృహాలంకరణ శాస్త్రం ప్రత్యేకంగా నేర్చుకుని వచ్చింది

ఇంటిరియర్ హౌస్ డెకొరేషన్. తమలాంటి పెద్దల యిళ్లు; వాటి డెకొరేషన్లు అవీ చూడాలనివస్తే తీసుకొచ్చాను. అనేక కళల్లో ఆరితేరిన పర్సనాలిటీ లెండి. సకలకళా కోవిదురాలన్నా తప్పు లేదు. వాట్ డు యు సే రోజీ?" షోగ్గా నవ్వాడు, వికారం మనిషి

రెమ్మలు రాల్చుకునేరోజులా సిగ్గుపడి పోయింది సకలకళాకోవిదురాలు.

"డోంట్ బి సిల్లీ; పెద్దలయెదుట అలా పొగడడం...

"ఇట్సాల్ రైట్, పొగిడేవాళ్లు లేక పోతే మనకళకు గుర్తింపు ...హా... హా...హా...ఇదిగో సీతాపతీ, మిస్.రోజీ మనయింటి అలకంకరణ చూస్తారుట మన ఏ.సి అదీ...ఆ...అమ్మగారు." వాక్యం మనిగిపోయింది

"థాంక్యు" వయ్యారంగా లేచి వెళ్ళింది మిస్ రోజీ. జీవితంలో ఏ అనుభవము మిస్ అయిన మనిషిలా కనిపించలేదామె, డాక్టరుకాబోతున్న గోపాలానికి

ఎర్రగా బంగారుబొమ్మలా శరీరం. ఎత్తుగా, బలంగా వయసు...హంగామా అట్టే చూస్తుంటే ఏ నాటకాల మనిషో...

"హా రి నీ" గతుక్కు మన్నాడు గోపాలం

ఈమె అమెరికా రిటరన్డు అంటూ దేమిటీ వికృతం మనిషి ?

ఇది నాటకాల యాక్టరే కాలేజీలో తమతోపాటు "కన్యాశుల్కం"లో మధుర వాణిగా వేసిందిగా ! నెల రోజులు అప్పుడు కాలేజీ ట్రూపుతో కలిసిఉన్నదీ కళావంతురాలు మొత్తానికీ వికృతం అన్నట్లు సకలకళాకోవిదురాలే పాలి పోయిన కొయ్యగుండె ఏదో వికృతాన్ని చూచినట్లయింది !

○ ○ ○

"మరింతకీ మీరొచ్చినపని ...?" ఏదో ఆత్రం కన్పించింది— పెద్దాయ నలో 'మందుకంటే రోగనివారణే ప్రధా నం. ప్రివెన్షన్ ఈజ్ - బెటర్‌దాన్ క్యూర్ అన్న పథకం ప్రభువులుచేపట్టా రుకదా! సకలరోగాలకు నివారణగా పని కొచ్చే చిట్కా మందొకటి మా కంపెనీ తయారు చేసింది_దానికి. సోలో ఏంజెం ట్లుగా తమరుంటే... అహహా... ప్రభు వుకి తమపేరు సూచించారు. తమ రైతే..."

"ఏమాత్రం మార్జినిస్తారేమిటి?" వ్యాపారం భాష మాట్లాడారు పెద్దాయన "హి...హి...మామూలే నీవోసగం... నేనోసగం... పాతసినిమాపాటే"

"ఇంతకీ కంపెనీ గిట్టుబాటు రేటు ఎంతుంటుంది?"

"సకలరోగ నివారణ క్యాప్సూల్సుకి గిట్టుబాటు రేటేమిటి సర్...హి...హా... హి... వందకో నాలుగురూపాయలుం టుంది మహా అయితే... హ... హి... హ..."

వందనాలుగు రూపాయలా? మట్టి బిళ్ళలు కావుగదా! పాలిపోయిన కొయ్య డాక్టరు గుండె పదునెక్కింది.

"అహ... అయితే వంద సల్ఫైకి మార్కెటు చేస్తే..." పెద్దాయనింకా వ్యాపారం భాషవదిలి పెట్టలేదు

"ష్యూర్, ష్యూర్ వ్యాపారంలో నిధులు, సకల..."

సకల కళాకోవిదుడ్ని అంటారేమిటి కొంపదీసి..."హ... హ... సరేమీరు వెళ్ళి ఆ సాంపుల్స్ అవీ పంపించండి మీసకల కళాకోవిదురాలు లోపం ఏం చూస్తున్నారో...హ ...హ... హ..."

సకల కళాకోవిదురాలి తలపులు చక్కలిగింతలై తరలివెళ్ళాడా పెద్దా యన!

○ ○ ○

సుడిగుండాల పాలైంది- కొయ్య డాక్టరై పోదామనుకున్న కుర్రాయన మనస్సు గిర్రున తిరిగే బొమ్మలను చూడసాగింది

ఆమెనెవరో గుయ్యారపు గుహలోకి తెచ్చారు

"సర్దార్ ఈ చిన్నది మాజాతిలో

ఎన్నిసార్లు తిన్నా యింకా,యింకా
తినాలనిపిస్తుంది










క్రేన్
వక్కపొడి
దీనికి పోటీ మరొకటి లేదు.

TARA - CBNPW - 1310 83 - TEL

బహుమేలైనది. తమకు నజరానాగా...”

“ఖూబ్, బహుత్ ఖూబ్. మరి మీకూ ఏం కావాలి?” గజదొంగ పెద్ద పులిలా పెదాలు తడుపుకున్నాడు

“ఏం లేదు సర్దార్. మీ ఇలాకాలో నాలుగు పరగణాలు మేముదోపిడీ చేసు కుంటాం సర్దార్. వందకి నాలుగు...”

“ఖూబ్, బహుత్ ఖూబ్ జావో ఐసా కరో. అరేయ్ బేవకూఫ్... ఈ సిన్న దాన్ని సల్లటి గదిలోకి...”

సీతాపతి చిన్నదాని చెయ్యి పట్టుకు న్నాడు ఎర్రటిచేయి, బలమైనపయసు

○ ○ ○

సకల కళాకోవిదురాలి తలపులు చక్కలిగింతలై లోనికెళ్ళాడు- పెద్దా యన. ఇంటీయరు డెకొరేషన్సు విప్పి పరీక్ష చేస్తుంటారు... కాబోలు, గోపాలం కొయ్యగుండె ఝుస్సుమన్నది ఛీ ఛీ ప్రభువుల ఉద్యోగులుగా రేపు తనూ ఇలాగే స. క కోవిదలను సప్లయి చేయాలా?

చల్లటి సాయంత్రపుగాలి వెచ్చగా తగిలింది డాక్టరు కాపడానికి ‘మెట్లు’ దిగుదామనుకున్న డా॥ గోపాలానికి మొఖమల్ పరచిన కొయ్యకుర్చీలోంచి పొడుచుకొచ్చిన ముక్కేదో అతని హృదయానికి ఖస్సుమని గుచ్చుకొన్నది. వెళ్ళిపోయాడు ఝుస్సుమంటూ గోపాలం డాక్టరు కాదలచుకోని డా. గోపాలం కాలిపోయిన గుండె మళ్ళీ ఎరుపెక్కింది।

○ ○ ○

ఎర్రబడి ప్రయోజనమేమిటి? ఉన్న లోకం ఇది, బస్సుమని లాభమేమిటి? తాను పుట్టిన ప్రపంచం ఇది. దీనితో రాజీపడాలా? కసిపెంచుకోవాలా? సాపు చేసుకోవాలా? యునతను ముప్పిరిగొం టున్న మూడు ప్రశ్నలు గోపాలాన్ని చుట్టుముట్టినై.

సాఫవుతుందా?

ఏం ఏందుకు కాదు! నాన్న ఎన్నో కొయ్యలను సజీవమూర్తులగా సాపుచేస్తు న్నాడు. తాను మాత్రం లోకంలోని కొయ్యముక్కలను ... సమాజసోదరు లను ఎందుకు చైతన్యరాసులుగా రూపొం దించకూడదు?

ఉద్యోగం అందించే ఆనందాలు తన కక్కరలేదు ఈ సకలరోగాశ్రయము లోజీవులను తాను సేవించలేడు.

రేపటి సమాజాన్ని మలచడంలో తాను పాత్రధారి అవుతాడు ఆ పాత్ర తనకు తృప్తినిస్తుంది. మరికి పట్టిన లోకంలోకి ముందు వచ్చిన పెద్దన్నయ్యో అదృష్టం తనది రాబోయే చిన్నారి తమ్ముళ్ళకై ఈ లోకాన్ని శుభ్రంచేసి సుగంధపు తెరలను దించుతాడు.

ఎర్రబడిన హృదయం త్యాగారుణి మను ధరించింది. మరో ప్రపంచపు ఉషోదయం ఎర్రగాలేదు. భగవారుణి మతో ప్రభవిల్లింది- డాకూలు, గజదొం గల కథల హీరో గోపాలానికి!

○ ○ ○

# ప్రేమభవంతి కావాలి!



వి. మోహన్ కుమార్

ఒక రాత్రివేళ మూలుగు వినిపించి లేచాడు ప్రశాంత్. ఆమె వణికిపోతోంది పక్కనే కూచుని అప్రయత్నంగా ఆమె నుదుటిమీద చెయ్యివేశాడు జ్వరంతో ఒళ్ళు కాలిపోతోంది. ప్రశాంత్ స్పర్శకి ఉలిక్కిపడి లేచింది

"వర్షం తగ్గిందా వెళ్ళిపోతాను" అంది.

ప్రశాంత్ ఆమె ఉలికిపాటుకి నవ్వాడు

"జ్వరం బాగా ఉంది పడుకోండి తగ్గాక వెడుదురుగాని" ఆమె ప్రశాంత్ వైపు చూసింది. జ్వరతీవ్రతతో ఎర్రబారిన ఆ కళ్ళు కష్టంమీద తెరుచుకున్నాయి.

* ______ జరిగిన కథ ______ *

ప్రకాష్ అమిత జాగ్రత్తగా స్వప్నకోసం జాగ్రత్తపడ్డం ఆరంభించడం ప్రవీణ్‌కి తెలీకపోదు. ప్రవీణ్ ప్రతికదలిక ప్రకాష్‌కి తెలిసేలా జాగ్రత్తపడుతూ కంపెనీనీ, స్వప్ననీ, స్వప్నతండ్రినీ, అల్లివుంచిన అల్లికలో జాగ్రత్తగా ఇరికిస్తు న్నాడు. ప్రకాష్ స్వప్నని వాగ్దానంలోపెట్టి ప్రేమ సాధించబోయాడు—ప్రశాంత్ వర్షంలో వచ్చిన అభాగ్యురాలికి సాయపడ్డాడు—కథ పాకంలో కొచ్చింది.

రుగ్మత ఆ కళ్ళలో స్పష్టంగా కనపడుతోంది. అలాంటి పరిస్థితిలో చిక్కుకున్నం దుకు తననితాను తిట్టుకోడం తప్ప మరేమీ చెయ్యలేని అశక్తత, అక్కణ్ణుంచి ఎలాగో అలాగ సాధ్యమైనంత త్వరలో వెళ్ళిపోవాలన్న తొందరతోపాటు ఆ చూపుల్లో కనిపించాయి

"భయం లేదు. నేను మీ అన్నయ్యలాంటివాణ్ణి. జ్వరం తగ్గాక వెడుదురు గాని. మీ మూలంగా నాకు ఏ ఇబ్బంది లేదు. సంశయం మాని విశ్రాంతి తీసు కోండి. ఎంత విశ్రాంతిగా ఉంటే అంత తొందరగా నయం అవుతుంది, అంత తొందరగా వెళ్ళిపోవచ్చు".

ఆమె భారంగా నడుం వాల్చింది. ప్రశాంత్ తనదగ్గర ఉన్న మాత్ర ఇచ్చి నీళ్ళుతాగించాడు. దుప్పటి కప్పి పడుకోపెట్టాడు.

ఆరయింది. ప్రశాంత్ డ్యూటీకి వేళయింది. లేచి కాలకృత్యాలు తీర్చుకున్న ప్రశాంత్ ఆమెవైపు చూసాడు. ఆమె నిద్రపోతోంది. అంటే జ్వరం కొంచెం తగ్గి ఉండాలి. 'ఆమెని సాయంత్రంవరకు ఇక్కడే ఉండమని, తనుడ్యూటీనించి వచ్చిన తర్వాత పంపిస్తే సరి' అనుకున్నాడు ఆమెను ఎలా లేపాలో తెలియక తచ్చాడు తున్నాడు ఇంతలో ఆమే లేచింది.

"తెల్లవారిందా- నేను వెడతాను. మీకు చాలా శ్రమ ఇచ్చాను" అంది.

రాత్రి ఆ స్థితిలో ఆమెను చూసినవాళ్ళెవరూ ఆమెలో ఇంత సంస్కారం ఉందని అనుకోరు అలాంటిస్థితిలో ఉండామె ఆమె మూలంగా తనకి ఏ ఇబ్బంది కలగకూడదని, తనమీద భారం మోపకూడదని తొందరపడుతోంది. తను పంపిం చేస్తే ఆమె ఎక్కడికెడుతుంది? మళ్ళీ రాత్రిలాంటి పరిస్థితిలో చిక్కుకోకుండా తననితాను సమర్ధించుకోగలుగుతుందా? తను ఆమెను తనదగ్గర ఉంచుకోలేడు. అయితే ఆమెకు సహాయం చెయ్యగలడు ఆమెగురించి తెలుసుకుని ఓ దారి ఏర్పాటు చేస్తే ఆమెకి పూర్తి సహాయం చేసినట్టవుతుంది.

"చూడండి మీరెవరో నాకు తెలియదు. ఏ కష్టంలో ఉన్నారో అంతకంటే తెలియదు. దానికి నేనేమైనా సాయం చెయ్యగలనో లేదో కూడా తెలియదు. వీటి గురించి మీతో మాట్లాడ్డానికి సమయం దొరకలేదు. నా డ్యూటీకి టైం అయింది. నేను వెళ్ళాలి. వచ్చాక వివరంగా మాట్లాడుకుందాం అధైర్య పడవద్దు. నేను ఏదో ఒకటి చేస్తాను. పక్కింటి కుర్రాడికి చెప్పాను. డాక్టర్‌దగ్గరికి తీసుకెడతాడు. ఇదిగో ఈ డబ్బు ఉంచుకోండి" అతను జేబులోంచి తీసి పాతికరూపాయలు ఇచ్చాడు.

"డబ్బు నిన్నరాత్రి మీకిచ్చిన పర్స్‌లో ఉంది" అందామె తడబడుతూ.

"ఫర్వాలేదు, సాయంత్రం వచ్చాక చూస్తాను. నే వస్తా" అతను తలుపు దగ్గరకువేసి వెళ్ళిపోయాడు.

అతనివంక ఆశ్చర్యంగా చూసిందామె.

22

సాయంత్రం ఆరయింది

త్వరలో రిలీజ్‌చెయ్యవలసిన అడ్వర్టయిజ్‌మెంట్ గురించి ప్రవీణ్ స్వప్నతో చర్చిస్తున్నాడు.

వాళ్ళిద్దరూ దీర్ఘంగా చర్చించడాన్ని గమనిస్తున్నాడు ప్రకాష్

చేజిక్కిన అవకాశం క్రమంగా చేతుల్లోంచి జారిపోవడాన్ని గమనించిన అతని హృదయం బాధతోమూలుగుతోంది చూస్తూండగానే ఆ అవకాశం నిన్నగాక మొన్న వచ్చిన మరొకడి చేతుల్లో పడటానికి సిద్ధం కావడంతో, తను కొట్టిన బంతి తిన్నగా ఫీల్డర్ చేతులలోకి వెళ్ళడాన్ని గమనిస్తున్న బాట్స్‌మన్‌లా విలవిలలాడాడు.

"ఈరోజు నా కారు పాడయింది కొంచెం లిఫ్ట్ కావాలి" చనువుగా అడిగాడు ప్రవీణ్ అతనికి కంపెనీ కారు వచ్చి నాలుగురోజులైంది


క్రివేణి ఇంకు
గమ్
ఆఫీసు పేస్టు
వాడి,
వాటి విశిష్ఠతను
గమనించండి.
kriveni
kriveni
OFFICE PASTE
IS 1221-71
ISI
తయారుచేయువారు,
కృష్ణవేణి ఇంకు ఫ్యాక్టరీ
751, తిరువత్తియూర్ హై రోడ్, మద్రాసు-600 081

"సరే" అంది స్వప్న నవ్వుతూ.

చూసి చూసి విసుగుపుట్టిన ప్రకాష్ లేచి బయల్దేరాడు. అతను బయటికి వెళ్ళ డాన్ని గమనించిన ప్రవీణ్ "లేద్దామా" అన్నాడు. స్వప్న లేచింది. ఇద్దరూ బయ టికి వచ్చారు. స్వప్నకారులో ఎక్కారు. ఆ కారు బయటికి దూసుకొచ్చి ప్రకాష్ కారుని ఓవర్‌టేక్‌చేసి ముందుకు పోయింది. ప్రకాష్ బాధతో కళ్లుమూసుకున్నాడు.

ప్రవీణ్ కబుర్లలోకి దిగాడు.

ఆఫీసులో ముభావంగా స్ట్రిక్ట్‌గా ఉన్నా, బయట చనువుగా సరదాగా ఉండే అతన్నిచూసి ఆశ్చర్యపోతూంది స్వప్న. చెపుతున్న కబుర్లు ఆపి "అన్నట్టు ఆనంద రావుగారు కలవమన్నారు" అన్నాడు. క్షణం ఆలోచించి "ప్రశాంత్ నువ్వు గాంధీ స్టాట్యూదగ్గర దిగి ఆటో తీసుకుని ఈ కాగితాలు మన బ్రాంచ్ ఆఫీసులో ఇచ్చి ఆనందరావుగారింటికి రా...నేను ఈమెని ఇంట్లో డ్రాప్‌చేసి ఆనందరావుగార్ని కలుస్తాను" అని స్వప్నవైపు తిరిగి "క్షమించండి" అన్నాడు,

స్వప్న ఫర్వాలేదు అన్నట్టు చూసింది

ప్రవీణ్ మాటల్ని నమ్మలేకపోయాడు ప్రశాంత్. అతని కారు నిక్షేపంగా ంది. ఆ సంగతి తనకి తెలుసు. అయినా ఎలా ఎందుకు [illegible] స్వప్నతో ఒంటరిగా ఉండడానికి పథకం వేస్తున్నాడా? ప్రవీణ్‌పట్ల అపనమ్మకం ఏర్పడింది ప్రశాంత్‌కి. అయినా చేసేదిలేక గాంధీవిగ్రహం ఉన్న కూడలిదగ్గర దిగి, ప్రవీణ్ చేతిలోంచి కాగితాలు తీసుకున్నాడు.

ప్రవీణ్ స్టీరింగ్ ముందుకూర్చున్నాడు. స్వప్న అతని పక్కన కూర్చుంది. దాన్ని గమనించిన ప్రశాంత్ అయిష్టంగా ఆటో ఎక్కాడు.

బ్రాంచ్ ఆఫీసుకి వెళ్ళిన ప్రశాంత్‌కి అక్కడ ఎవరూ ఆ కాగితాల కోసం ఎదురుచూస్తున్న దాఖలా కనిపించలేదు. ప్రవీణ్ ఏదో వల పన్నుతున్నాడు. స్వప్న ఆ వలలో పడుతోంది. ఆమెను దాంట్లోంచి బయటకి లాగడం ఎలా? ఆలోచిస్తూ ఆనందరావు గారింటికి చేరుకున్నాడు ప్రశాంత్. అక్కడ స్వప్న, ప్రవీణ్‌లు లాన్‌లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆనందరావుగారు రావడానికి ఇంకా సమయం పడుతుందిట. స్వప్నకి మోసం అర్థం కావటంలేదా? ప్రవీణ్ ఆమెకి ఏదోకథ చెప్పి మభ్య పెడుతున్నాడా? ప్రశాంత్‌కి ఏం చెయ్యాలో తోచలేదు.

23

"అంకుల్ ఆంటీ వెళ్ళిపోయింది" ప్రశాంత్ ఇంటికి రాగానే పక్కింటి గోపీ చెప్పాడు.

"ఎక్కడికెళ్ళింది. నువ్వు డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళలేదా" "లేదంకుల్ ఉదయం తొమ్మిది గంటలకి డాక్టర్ దగ్గరకి తీసుకెడదామని వచ్చాను. ఇంటికి గడియ పెట్టింది. లోపల ఎవరూలేరు, కాసేపు చూసి, తలుపు తాళంపెట్టి, రాగానే 'పక్కింటికి వచ్చి తాళంచెవి తీసుకోమని' కాగితం మీద రాసి దాన్ని తాళానికి గుచ్చి వచ్చాను. ఇంతవరకు రాలేదు"

ప్రశాంత్ ఆశ్చర్యపోయాడు. ఆమె ఎవరు? దొంగా? జాలికలిగేలా ప్రవర్తించి - అదను చూసుకుని అన్నీ దోచుకుపోయే ఘరానా దొంగా? లేకపోతే ఇంతమోసమా? కనీసం చెప్పకుండా...

ప్రశాంత్‌కి కోపం వచ్చింది.

"సరె నువ్వు వెళ్ళు" అన్నాడు ఆ అబ్బాయితో

అతను వెళ్ళిపోయాడు.


ముస్తాబులో మార్పు!

సరిక్రొత్త ఆకర్షణీయమైన సీసాలలో

లోధ్ర

బాధారహిత ప్రకృతి సిద్ధమయిన ఆరోగ్యమును స్త్రీలకు 80 సంవత్సరములుగా ఇచ్చుచున్నది

Lodhra

ఉచిత వైద్య సలహాకు ఈ కూపనును పూర్తిచేసి మీ జాబుతో పంపండి

పేరు, ....................

విలాసము. ....................

.................... PIN ..........

కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్

రాయపేట, మద్రాసు-14

ఏజంట్లు :-
సీతారామ్ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్,
విజయవాడ - సికిందరాబాద్

ప్రశాంత్ లోపలికి అడుగుపెట్టాడు. గబగబ తన వస్తువులన్నీ చూసాడు. ఎక్కడి వక్కడే ఉన్నాయి. షల్ఫ్‌లోని సేవింగ్స్ బాక్స్ తెరిచే వుంది. దాంట్లో డబ్బులు తక్కువగా ఉండడం చూసాడు. వందకి పైగా ఉండాలి. పాతిక రూపాయలు కొంత చిల్లర మాత్రమే ఉంది.

ప్రశాంత్‌కి మోసం అర్థమయింది.

ఆ అమ్మాయి డబ్బులు తీసుకుని ఉడాయించింది. తను ఇచ్చిన పాతిక, ఈ డబ్బాలో డబ్బులు మొత్తం వంద వరకు ఉంటాయి.

తను ఎంత ఫూల్!

రాత్రి అమాయకంగా కనిపించిన ఆమెను చూసి ఎవరో దగా పడ్డ చెల్లిఅనుకున్నాడు. అప్పుడు ఆమె అసలు రంగు బయటపడింది.

అందరూ తన అమాయకత్వాన్ని అదనుగా తీసుకుని, మంచితనానికి దెబ్బ కొట్టే వాళ్ళే.

మిగిలిన తన వస్తువుల్ని చూసాడు. అవి అలాగే చెక్కు చెదరకుండా ఉన్నాయి. వాటి అవసరం ఆమెకు లేదేమో అందువల్ల వాటిని అలాగే వదిలి తనకు అవసరమైన డబ్బుని మాత్రం తీసుకుని వెళ్లింది

మోసపోయానన్న భావం ప్రశాంత్‌ని బాధ పెట్టింది. అన్యమనస్కంగా కుర్చీలో కూర్చుండి పోయాడు. ఇప్పుడేం చెయ్యాలి? పోలీసు రిపోర్టు ఇవ్వాలా?

దీన్ని నలుగురికి తెలిసేలా చెయ్యడం మూలంగా ఏం లాభం. ఓ అమ్మాయి రాత్రి పూట తన దగ్గర తల దాచుకుందంటే ఎవరు నమ్ముతారు? తనకి ఆమెతో ఏదో సంబంధం ఉందంటారు గట్టిగా మాట్లాడుతే ఆమె ఆస్థితిలో ఉండడానికి కారణం తనే అంటారు.

పంద రూపాయలు పోగొట్టుకున్నందుకు బాధపడటంలేదు ప్రశాంత్. జీవితంలో ఎన్నో పోగొట్టుకున్నాడు. వందరూపాయలు పెద్దలెక్కలోకిరావు. ఇప్పుడు

---

చిగురాకులలో పలుకమ్మా

విక్టోరియా మహారాణి గారి ఇంట్లో ఎలుకలు పట్టేవాడికి ఆస్థానకవి టెన్నిసన్' కంటే ఎక్కువ జీతం లభించేదిట— కవులు రచయితల పరిస్థితి మన దేశంలో ప్రస్తుతం ఇదేగా!




పోయింది డబ్బుకాదు. మనుషుల మంచితనంమీద నమ్మకం.

## 24

ప్రకాష్,

అత్తయ్యకి నీ అడ్రస్ తెలిసింది అని ఆశ్చర్యపోతున్నావా? మొన్ననే మామయ్య ఫ్యాక్టరీలో పనిచేసే ఆయన నిన్ను చూసాట్ట. నీ గురించి చెప్పాడు. దాన్నిబట్టి నీ ఆఫీసు అడ్రస్‌కి ఉత్తరం వ్రాస్తున్నాను. నువ్వు ఎలా ఉన్నావు? నీ గురించి తెలియగానే వెళ్ళి నిన్ను చూడమని నీగురించి తెలుసుకోమని మామయ్యకి చెప్పాను. "వాడికి మనమీద అభిమానం ఉంటే, వాడికి మనం గుర్తుంటే వాడే వ్రాస్తాడు, అంతేకాని వాడెలా ఉన్నాడో. ఏంచేస్తున్నాడో నేను ఎంక్వైరీచెయ్యను" అన్నారు. ఆయన సంగతి నీకు తెలుసుగా. ప్రకాష్! నువ్వేనా ఉత్తరాలు వ్రాయచ్చుగా. అప్పుడే మమ్మల్ని మర్చిపోయావా? నువ్వు లక్ష్మిని చేసుకోవని మావయ్యకి ఎందుకో అనుమానంగా ఉంది. అందువల్ల లక్ష్మికి వేరే సంబంధం చూసి త్వరగా పెళ్ళిచేయాలనుకుంటున్నాడు. లక్ష్మి ఒప్పుకోటంలేదు. దానికి చిన్నప్పట్నుంచి నీమీద మనసని నాకు తెలుసు. లక్ష్మితో సఖ్యంగా ఉంటూనే, నువ్వు అలా హఠాత్తుగా వెళ్ళిపోడంతో నాకు కారణం అంతుపట్టడంలేదు. నీ అభిప్రాయం తెలియచేస్తే మేము మా నిర్ణయం తీసుకుంటాం.

ప్రకాష్! చిన్నప్పట్నించి నిన్ను మా అబ్బాయిలాగే చూసుకున్నాం. నీకు లక్ష్మంటే ఇష్టంలేకపోతే నిన్ను ఒత్తిడిచేసే ప్రసక్తిలేదు. ఈ విషయాల్లో ఎవరి ఇష్టం వారిది. మేం ఓ నిర్ణయం తీసుకోడానికి నీ అభిప్రాయం కావాలి. కాబట్టి, అత్తయ్య ఏమనుకుంటుందో అనికాక నిర్మొహమాటంగా నీ అభిప్రాయం వ్రాయి.

ఇలా వ్రాసినందుకు ఏమీ అనుకోవద్దు.

ఇట్లు,
ప్రేమతో
మీ అత్తయ్య

ఆ ఉత్తరం చదివిన ప్రకాష్‌కి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. ఇప్పుడు ఏం సమాధానం వ్రాయాలి ?

## 25

స్నానంచేసి తలదువ్వుకోడానికి అద్దంముందు నించున్న ప్రశాంత్‌కి అద్దం కింద ఓ కాగితం కనిపించడంతో చటుక్కున అద్దాన్ని ఎత్తి దాన్ని తీసాడు.

ఏదో ఉత్తరంలా ఉండడంతో చదవడం మొదలెట్టాడు,

అన్నయ్యా,

మిమ్మల్ని ఇలా సంబోధిస్తున్నందుకు ఏమీ అనుకోరుకదూ...మీరు చూపిన అభిమానం, కరుణ ఇలా పిలవమని నన్ను ప్రేరేపిస్తున్నాయి, జీవితంలో ఓ అన్నయ్య ఉంటే ఎంతో బాగుండేదని చిన్నప్పటినుంచి అనుకునేదాన్ని, ఆలోటు ఇప్పుడు తీరింది. ఈ జీవితం ఇంకా ఎన్ని రోజులుంటుందో తెలియదు. కాని జీవితంలో ఆఖరిరోజువరకు మిమ్మల్ని గుర్తుపెట్టుకుంటాను. జీవితంలో ప్రతి దశలో భంగపడ్డ నా మీద భగవంతుడు జాలిపడి చివరిరోజుల్లో కానుకగా నాకు మీ ఆప్యాయతని ప్రసాదించాడేమో అనిపిస్తోంది. లేకపోతే ముక్కుముఖం తెలియని నామీద మీరు వాత్సల్యం చూపడం ఏమిటి ? నా సమస్యని తెలుసుకుని దారిచూపడానికి సిద్ధపడటం ఏమిటి ?

నన్ను చేరదీసిన వాళ్ళెవ్వరూ సుఖంగా ఉండలేరు. మీకు కూడా ఆ అవస్థ రాకూడదు. అందుకే మీ సహాయం అందుకోటంలేదు. అన్యథా భావించవద్దు.

డాక్టరికి చూపించుకోమని. మందులు కొనుక్కోమని మీరు డబ్బు ఇచ్చారు. డాక్టర్లమీద, మందులమీద డబ్బులు ఖర్చుపెట్టే స్థితిలో నేను లేను. రోగాలంటారా,




అవి నన్నేం చెయ్యలేవు. మృత్యువు నన్ను చూసి జడుసుకు పారిపోయింది. కాబట్టి మీ రిచ్చిన డబ్బు నేను ఉపయోగించలేదు.

నా పర్స్‌కోసం వెతికాను. అది మీ పెట్లోఉంది. ఆ పెట్టి తాళంచెవి దొరక లేదు. దాంట్లో తొంభై ఎనిమిది రూపాయలున్నాయి. మీ రిచ్చిన పాతికరూపా యలుకాక మీ సేవింగ్స్ బాక్స్‌లోంచి డెబ్భైమూడు రూపాయలు తీసుకున్నాను. నన్ను దొంగనుకుంటారేమో ఇలా తీసుకోడం దొంగతనమే అయినా; మీకు నష్టం కలగజేయలేదు.

ఇలా చెప్పకుండా వెళ్ళిపోవడం మర్యాదకాదు. సత్ప్రవర్తన అంతే తే కాదు. నన్ను ఈ విషయంలో మన్నించండి.

ఇట్లు
అభాగ్యురాలైన
మీ చెల్లి.

ఆ ఉత్తరం చదివిన ప్రశాంత్‌కి మతిపోయింది. హృదయం జాలితో నిండి పోయింది. వెంటనే పెట్టెతెరచి ఆమె పర్స్ తీసాడు. దాంట్లో తొంభై ఎనిమిది రూపాయలున్నాయి. అంతేకాదు కొన్ని ఉత్తరాలు ఫొటోలు ఉన్నాయి. వాటిని తెరిచి చూసాడు.

ఆ ఫొటోని చూసిన ప్రశాంత్‌కి షాక్ కొట్టినట్టయింది. ఆ అమ్మాయి; పక్కన ప్రవీణ్ !

గబగబ ఆ ఉత్తరం చదివాడు.

విజయా !

తొందరపాటు ప్రతిమనిషికి సహజం. అందులో వయసు ఉరకలువేసే సమయంలో తొందరపడ్డం మామూలే. మనం ఇద్దరం తొందరపడ్డాం. దానికి కేవలం నన్ను నిందించి ప్రయోజనంలేదు. నీ బాధ్యతకూడా ఉంది. ఈ రోజు జరిగిన దాంట్లో నా పాత్ర ఎంతో నీ పాత్రా అంతే అందువల్ల ఒకళ్ళనొకళ్ళు నిందించుకోడం అనవసరం.

చిన్నప్పటినుంచి నా ఆశలు; ఆశయాలు నీకు తెలుసు. అవి నెరవేరకుండా బంధంలో చిక్కుకోడం నాకు ఇష్టంలేదు. నా కోసం నువ్వు ఆగడల్చుకుంటే ఒకటే పరిష్కారమార్గం. అది నీకు చెప్పాను. దానికి కావలసిన సహకారం అందిస్తానని చెప్పాను. నువ్వు తోకతొక్కిన తాచులా లేచావు. నేనేం చెయ్యను ?

ఈ సంఘంలో పిల్లలకి తక్కువలేదు. భాగ్యవంతులు, నిర్భాగ్యులు, దౌర్భాగ్యులు ఎందరో! ఒక్క శిశువుని ఈ లోకంలోకి రాకుండా ఆపేస్తే నష్టమేం లేదు. ముందు మనం నిలదొక్కుకున్న తర్వాత ఎంతమందిని కావాలంటే అంతమందిని పొందచ్చు. కాని సెంటిమెంటుని పట్టుకుని మనకి ఓ గుదిబండని తగిలించుకుంటే మనం ముందుకి పోలేం. మనం మనతోపాటు రాబోయే శిశువు సామాన్యంగా మిగిలిపోతాం. పిల్లల్ని కనడం ముఖ్యంకాదు, వాళ్ళని గొప్పగా తీర్చిదిద్దడం ముఖ్యం. తను వెయ్యబోయే చిత్రంలో పొరపాటుగా గీసిన గీతని చిత్రకారుడు అలాగే వుంచడు. చెరిపేసి ఇంకో గీత గీస్తాడు. జీవితంలోనూ అంతే. పొరపాటుని దిద్దుకోడంకోసం అవసరమైతే తప్పుగాగీసిన గీతని చెరిపెయ్యాలి. నువ్వు దీనికి ఒప్పుకోవు. నేనేం చెయ్యను ? బాధ్యతలు లేకుండా ఆనందం అనుభవించడం ఈ రోజులలో సాధ్యమే. అయితే సెంటిమెంటును పట్టుకుని వేళ్ళాడే నీలాంటివాళ్ళు ఆ అవకాశాన్ని అనుభవించలేరు. మాలాంటివాళ్ళని అనుభవించనివ్వరు. నేనేం చెయ్యను ? నీకు నచ్చచెప్పడానికి నా శాయశక్తులా ప్రయత్నించాను. నీకు పట్టుదల ఎక్కువ, లౌక్యం తక్కువ. అందువల్ల నువ్వు సుఖపడలేవు. పట్టుదలతో ముళ్ళబాటలో ప్రయాణం చెయ్యడానికి సిద్ధపడుతున్నావు. నిన్ను ఎలా రక్షించేది. నువ్వు చెప్పిన మాట వినకపోతే నేనేం చెయ్యను? నేనేదో విలన్ అనుకుని నన్ను తిట్టుకుంటావని

నాకు తెలుసు, నేను విలన్ని కాను. ప్రాక్టికల్ మనిషిని. దీన్ని నువ్వు అర్థం చేసుకోలేకపోతే నేనేం చెయ్యను ?

నువ్వు కాదనుకున్నా-నీ —ప్రవీణ్,

ఆ ఉత్తరం చదివిన ప్రశాంత్‌కి సంగతి అర్థమయింది. ప్రవీణ్‌ని చూడగానే అతను సరైనవాడు కాదనిపించింది. అతని మాటలకీ చేసే పనులకీ పొంతనలేదు. అతనిమీద తనకి మొదటినుంచీ అపనమ్మకంగానే ఉంది. ఇప్పుడు అది ఋజువైంది. కాని ఆనందరావుకి, స్వప్నకి అతనంటే గురి. వాళ్ళని అతని బారినుంచి కాపాడాలి. కనీసం విజయ తనకి సహకరిస్తే దీన్ని సాధించచ్చు. కాని ఆమె ఎక్కడికి పోయింది ? ఆమెకోసం ఎక్కడ వెతకాలి ?

26

విజయకోసం వెతకడం మొదలెట్టి నాలుగురోజులైంది. ఆమె జాడలేదు. ఎక్కడ వెతకాలో, ఎలా వెతకాలో అర్థంకావడంలేదు ప్రశాంత్‌కి.

పరధ్యాన్నంగా కారు నడుపుతున్న ప్రశాంత్, ఎదురుగా లారీ రావడంతో సడన్‌గా పక్కకి తిప్పాడు.

"నాయనా మమ్మల్ని నాలుగుకాలాలపాటు బతకనీ, ఇద్దరం పెళ్ళి కావలసినవాళ్ళం" అన్నాడు ప్రవీణ్. వెనకసీట్లో అతనిపక్కనేకూర్చున్న స్వప్న నవ్వింది.


| 22 | 27 | 20 |
|---|---|---|
| 21 | 23 | 25 |
| 26 | 19 | 24 |

(మాదిరి మొత్తం 29)

5000 రూ॥ విలువైన బహుమతులు పొందండి

ఎంట్రీఫీజు లేదు. మొదట వచ్చిన పది ఎంట్రీలకు ఉచితంగా వాచీ బహుమతి.

బహుమతులు : టెలివిజన్‌గానీ, టేప్ రికార్డర్‌గానీ. కన్సొలేషన్ బహుమతులు : జెనివా ట్విన్‌వన్ మోడల్ 810 రూ॥ విలువైంది 170 రూ॥ లకే... వ్యాపార అభివృద్ధి పథకంపై. మాదిరి ప్రకారము కాగితంపై 9 ఖాళీ గళ్ళను గియ్యండి. 18 నుండి 26వరకు ఇమూలగా, ఏటవాయిగా వరుసగా అంకెలని వుపయోగిస్తూ మొత్తం కూడితే 66 రావాలి. ఒక అంకె ఒకేసారి ఉపయోగించాలి, 20 రోజుల్లోగా ఎంట్రీలు చేరాలి.

NEW GENEVA ELECTRONICS (JH)
P.B. NO. 36. AMBALA-133001.

నాలుగుకాలాలపాటు ఎందుకు? అందర్నీ మోసం చెయ్యడానికా? ప్రశాంత్ మనసు కుతకుతలాడింది. తనకు తెలిసింది ఇప్పుడే స్వప్నకి చెప్పెయ్యాలనిపించింది. కాని దానివలన లాభం? తనుకూడా ఓ శత్రువు అనుకుంటుంది స్వప్న నిజం చెప్పినా అర్థం చేసుకోదు. విజయ దొరికాక సందేహానికి తావులేకుండా తిరుగులేకుండా నిరూపించాలి.

ఎందుకోగాని అతనికి ప్రవీణ్‌నిచూస్తేనే అసహ్యంవేస్తోంది. అయినా అణుచుకుని నెమ్మదిగా డ్రైవ్ చెయ్యసాగాడు. అలా ముందుకెడుతున్న అతనికి ఫుట్‌పాత్ మీద తనకెదురుగా వస్తున్న విజయ కనిపించింది.

కారు చటుక్కున ఆపి 'క్షమించండి' అని కారుదిగి పరుగున ఆమెవైపు పరుగెత్తాడు. అతని ప్రవర్తనకి ఆశ్చర్యపోయారు స్వప్న, ప్రవీణ్. అతను పరుగెడుతున్న దిశగా చూసాడు ప్రవీణ్. విజయ కనిపించడంతో ఉలిక్కిపడ్డాడు. ఆమెకూడా తనని చూడ్డం గమనించాడు. అతని నాడి గబగబా కొట్టుకుంది. దొరికిపోయినట్టుగా ఫీలయ్యాడు. గబుక్కున ఏదో ఒకటి చేసెయ్యాలని తొందరపడుతున్నాడు.

"వాట్ దిస్ ఫూల్ ఈజ్ డూయింగ్" ప్రవీణ్ కోపంగా అన్నాడు. స్వప్న కూడా ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయింది.

"హుఁ...తన ప్రేయసిని చూడగానే కారాపి ఆమెదగ్గరికి పరుగెత్తాడు. ఇలాంటివాడు డ్రైవర్ ఉద్యోగానికి పనికిరాడు" ప్రవీణ్ మండిపడ్డాడు.

ప్రశాంత్ ఆమెతో ఏదో మాట్లాడ్డం, ఓ కవర్ ఆమెకి ఇవ్వడం కనిపించింది స్వప్నకి.

ప్రవీణ్ కోపంగా లేచి డ్రైవర్‌సీట్లో కూర్చున్నాడు.

ప్రశాంత్ వెనక్కితిరిగి కారుదగ్గర కొచ్చాడు.

"క్షమించండి. తెలిసిన అమ్మాయి. ఆ అమ్మాయి వస్తువు నాదగ్గర ఉండిపోయింది. దాన్ని ఆమెకి ఇవ్వాలని ఆమెకోసం వెతుకుతున్నాను" అన్నాడు ప్రశాంత్.

"అడ్రస్‌కూడా తెలియని అమ్మాయి తనవస్తువుని నీదగ్గర ఉంచిందంటే నమ్మమంటావా? ఈరోజు నీ ప్రవర్తన క్షమించరానిది" అంటూ కోపంగా తలుపేసుకున్నాడు ప్రవీణ్. ప్రశాంత్‌ని అక్కడే వదిలేసి రయ్యిమని దూసుకుపోయాడు. స్వప్న మాట్లాడకుండా అలాగే చూస్తూ వుండిపోయింది.

(సశేషం)

# భ్రమణం

## కాలెప్పు శివశేఖర్

కళ్ళ ముందు జరిగిపోతున్న యిన్ని ఘోరాల్ని నాలో దాచుకోలేను. అలా అని పదిమందికీ చెప్పనూలేను.

చెబితే...?

అలివేలు అందరి లోనూ నవ్వుల పాలవుతుంది.

ఆమె కళ్ళల్లో కన్నీళ్ళను నేచూడ లేను. చూసి వోదార్చలేను. వోదార్చే వోర్పు నాలో లేదు.

అందుకే బాధపడ్తున్నా, బాధపడ్తూ ఆమె కథ రాస్తున్నాను.

ప్రసవ వేదన పడి బిడ్డను కన్నతల్లి ఆ బిడ్డను చూసి ఆనందపడుతుంది కథ రాయక ముందు రచయితపడే ఆవేదన కూడా అటువంటిదే. రాసిన కథనుచూసి ఆనంద పడడం కూడా అంతే సహజం.

అయితే, ఈ కథ రాసి నేను ఆనంద పడనా? ఆవేదన చెందనా? ఏమో అది నాకే తెలీడం లేదు.

ఆ గ్రామం మావూరు అని గర్వంగా చెప్పలేను.

ఎందుకంటే ఆవూరు వూరులా కాక పల్లకాడులా వుంటుంది.

నా చిన్నతనంలో ఎలా వుందో యిప్పుడూ అలాగే వుంది, గత యిరవై ఏళ్లుగా ఏ మాత్రమూ అభివృద్ధి లేని మారుమూల గ్రామం మాది.

పంచాయితీ ఆఫీసు అని చెప్పబడేందుకు వూరి మధ్యలో చిన్న బిల్డింగ్ వుంది. అందులో పగలు పరిపాలకులు చేరి ఏవేవో కబుర్లాడుకుంటారు, లేక పోతే పేకాడు కుంటారు. రాత్రులందు పంచాయితి ఆఫీసు పరిపాలకులకు పావన మందిరమై పోతుంది, లేక తాగుబోతుల నిలయమై పోతుంది.

పంచాయితీఆఫీసుకి ఎదురుగావున్నదే బడి. నా చిన్నప్పుడు ఆ బడికి ఓ పూరి పాక వుండేది. ఇప్పుడు పైకప్పులేని మొండిగోడలు మిగిలాయి

ఏడాదికి సగం రోజులు బడి జరగదు. జరిగిన సగం రోజుల్లో మాష్టర్లున్నా పిల్లలు రారు. మాష్టార్లు రాని రోజుల్లో ఆ బడిలో గోళీకాయలు ఆడు

కుంటూవుంటారు. లేక తన్నుకుంటూ, తిట్టుకుంటూ వుంటారు.

ప్రజలను తీర్చిదిద్ది, పాలించే పంచాయితీ- పిల్లల భవిష్యత్తుకు పునాదులు వేసే బడి యింత గొప్పగా వున్న మా వూరు గొప్పతనం ఎలాంటిదో గ్రహించగలరు.

ఆ బడిలోనే నేను చదివాను.

అ బడిలోనే అలివేలూ చదివింది.

ఆ బడిలోనే శకుంతల టీచరుండేవారు.

శకుంతలగారి కూతురు అలివేలు.

టీచరంటే నాకెంతో గౌరవం అలివేలంటే నాకేంతో యిష్టం.

రోజూ సాయంత్రం మాష్టారింటికి ప్రైవేటుకి వేళ్ళేవాణ్ని చాలా రాత్రి వరకూ, అక్కడే వుండిపోయేవాడ్ని. ఒకోసారి అక్కడే నిద్రపోయే వాడ్ని.

ఆ వయసులో శకుంతలగారి వ్యక్తిగత విషయాలు నాకంతగా తెలీవు.ఎవరెవరో ఏవేవో చెబుతున్నా అంతగా అవగాహనమయ్యేవి కావు.

నాకు తెలిసుండగా ఆమె ఏనాడూ బొట్టు పెట్టుకోలేదు.

ఈ వూరు రాకముందే ఆమె భర్త చనిపోయాడట. అతికష్టం మీద మావూరి బడిలో పంతులమ్మగా వుద్యోగం సంపాదించగలిగేరట.

ఆమెకా వుద్యోగం రావడానికి ముఖ్యకారకుడు ప్రెసిడెంట్ ముకుందరావు.

స్వాతంత్ర్యం వచ్చిన దగ్గ చీ ఈనాటి వరకూ మావూరికి ప్రెసిండెంటు ముకుందరావే.

అసలు స్వాతంత్ర్యం ఎప్పుడొచ్చిందో,ఎందుకొచ్చిందో,దేనికొచ్చిందో యిప్పటికి మావూర్లో చాలా మందికి తెలీదు.

ఏ మగదిక్కూ లేని ఆమె, అలివేలుని చంకనెత్తుకొని మావూరు వచ్చిందట.

మగదిక్కులేని ఆడదానిని అడ్డమైన ప్రతివాడూ ఆదుకోడానికి సిద్ధమైపోతూ వుంటారు.

శకుంతల గారికీ, ముకుందరావుకీ సంబంధం వుంది. వుందని వూళ్ళో వాళ్ళందరికీ తెలుసు. అందరితో పాటు నాకూ తెలియనిదేమీ కాదు. అందుకు ప్రత్యక్ష సాక్షిని కూడా నేనే.

చ్చాలాపొద్దుబోయేంత వరకూపాఠాలు చదువుతూ మాష్టారింట్లో వుండిపోయేవాడ్ని. నాతోపాటు అలివేలు కూడా చదువుతూ వుండేది.

మా ఎదురుగా ముకుందరావు యింట్లోకి వచ్చేసేవాడు. మాష్టార్ని చూసి ఓ చిరునవ్వొకటి నవ్వి, లోపలిగదిలోకి వెళ్ళిపోయేవాడు.

మాష్టారు నన్ను యింటికి వెళ్ళమనేవారు.

ముకుందరావు రాగానే నన్నెందుకు వెళ్ళమనేవారో నాకర్థమయ్యేది కాదు.

## తెలుగు తేజం – వెలుగు నిత్యం

కాకతీయుల తర్వాత చెల్లాచెదురైన తెలుగుజాతి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో మళ్ళీ ఒకేచోటుకు, ఒకే నీడకు చేరుకొని అఖండజాతిగా అవతరించింది. నాటి నుంచి గతకీర్తి స్మృతులను నెమరు వేసుకుంటూ, వర్తమానాన్ని శుభకరంగా, సుందరంగా, సుఖప్రదంగా నిర్మించుకుంటూ, భవిష్యత్తును అఖండంగా ఊహించుకుంటూ ప్రగతివైపు పురోగమిస్తున్నది

ఈ పురోగమన యాత్రను మరింత సుగమం చేయడానికి, రాష్ట్రాభ్యుదయాన్ని, ప్రజాసంక్షేమాన్ని సత్వరమే సాధించడానికి; శ్రీ ఎన్. టి. రామారావుగారి నాయకత్వంలో ఏర్పాటైన రాష్ట్రప్రభుత్వం అనేక కార్యక్రమాలు చేపట్టింది.

* 15 అంశాల ప్రగతి పథం కార్యక్రమం ద్వారా బడుగువర్గాల జీవితాల్లో నూతన చైతన్యం వెల్లివిరిస్తోంది.
* సంక్షేమ సేవా కార్యకలాపాలకు నిధుల కేటాయింపు రెట్టింపు చేయబడింది.
* బలహీన వర్గాలకోసం 2 20,000 పక్కా ఇండ్ల నిర్మాణం దశలవారీగా చేపట్టబడింది.
* పేదవారికి కిలో బియ్యం రెండురూపాయలకే అమ్మించే పథకం వల్ల 94.22 లక్షల మందికి లాభం చేకూరుతోంది.
* ప్రాథమిక విద్యావ్యాప్తికి 16,000 ఉపాధ్యాయులను ప్రత్యేక ప్రాతిపదికపై క్రొత్తగా నియమిస్తున్నారు.
* స్వచ్ఛమైన పాలనా యంత్రాంగాన్ని ప్రజలు అందించే ఉద్దేశంతో ప్రభుత్వం నెలకొల్పిన లోకాయుక్త 1983 నవంబరు 1 నుండి అమలులోకి వచ్చింది.
* వృత్తి విద్యాలయాల్లో అర్హతకు ప్రాధాన్యం యిచ్చే ఉద్దేశంతో కాపిటేషన్ ఫీజు వసూలు చేయడాన్ని ప్రభుత్వం నిషేధించింది.
* ప్రాథమిక విద్యావ్యాప్తికి మధ్యాహ్నభోజన పథకాన్ని అమలుపరుస్తున్నారు. దీనివల్ల దాదాపు 40 లక్షల మంది బలహీనవర్గాలకు చెందిన పిల్లలు ప్రయోజనం పొందుతున్నారు.
* మహిళలకోసం ప్రత్యేకంగా ఒక మహిళా విశ్వవిద్యాలయాన్ని తిరుపతిలో ప్రారంభించడం జరిగింది.

* గ్రామాలలో మంచినీటి ఎద్దడిని తీర్చడానికి కనీసం 100 జనాభాకు ఒక మంచినీటి వనరును ఏర్పాటు చేస్తున్నారు.

నవంబరు 1, 1983 నుండి అమలుజరుగుతున్న నూతన కార్యక్రమాలు

గ్రామోదయ : గ్రామీణ ప్రాంతాల్లో ప్రగతి పథకాలను చేపట్టి నిరుద్యోగాన్ని నిర్మూలించేందుకు యువతకు స్వయం ఉపాధి సౌకర్యాలు కల్పించడానికి కేంద్ర సహాయంతో చేపట్టబడినది. ఈ కార్యక్రమం గ్రామీణాభివృద్ధికి యువత సేవలను వినియోగించుకోవటం ఈ పథకం ప్రధాన లక్ష్యం. - దీప - · ప్రతిజిల్లాలో ఉపాధి, పారిశ్రామిక పెంపుదల సంస్థను ఏర్పాటు చేసివిద్యావంతులలో నిరుద్యోగాన్ని పరిష్కరించడానికి ఉద్దేశించబడినది ఈ కార్యక్రమం. గ్రామసౌభాగ్య సాధనకు దీనివలన సాధనకు దోహదం కలుగుతోంది. – విముక్తి – : పాకీపని నుండి పనివారికి విముక్తి కలిగించడానికి, గ్రామాలలో ప్రధానంగా మహిళల సౌకర్యార్థం సెప్టిక్ మరుగుదొడ్లను నిర్మించడానికి ఉద్దేశించినది ఈ పథకం. ఈ కార్యక్రమం క్రింద అన్ని మున్సిపల్ పట్టణాలలోను, రక్షిత మంచినీటి పథకాలుగల పెద్ద పంచాయతీలలోను తక్కువఖర్చులో సెప్టిక్ మరుగుదొడ్లను దశలవారిగా నిర్మిస్తారు. సామాజిక మరుగుదొడ్ల నిర్మాణంలో ప్రయోగాత్మకంగా బయోగాస్ ఉత్పత్తికి అవకాశం కల్పించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ సందర్భంలో పాకీవృత్తిని అవలంభిస్తున్న వారి సంపాదనకుగానీ ఆర్థిక ప్రతిపత్తినిగాని భంగం కలగని రీతిలో వారికి పునరావాసం కల్పించబడుతుంది. ఇటీవల తుఫాను వరదవల్ల కలిగిన నష్టాన్ని భర్తీ చేయాలంటే పెద్ద ఎత్తున నిర్మాణ, సంక్షేమ, సహాయ, పునరావాస కార్యక్రమాల్ని చేపట్టాల్సి వుంటుంది. ప్రభుత్వం చేపట్టే బృహత్తర కృషిలో ప్రతిపౌరుడు ముందుకువచ్చి ప్రభుత్వకార్యక్రమాలలో భాగస్వామిగా తోడ్పడినప్పుడే యిది సాధ్యమౌతుంది.

సమాచార, పౌరసంబంధ శాఖ : హైదరాబాద్

ఏడో తరగతి వరకూ నేనక్కడే చదువుకున్నాను. ఆపై బడిలో తరగతులు లేవు.

మానాన్న నన్ను పట్నం పంపించేశాడు.

అలివేలు చదువు మానేసింది.

అలివేలుకూడా నాతోపాటు పట్నం వచ్చి చదువుకుంటే ఎంతబావుణ్ణో అనుఅనుకున్నాను. ఈ విషయమై మాష్టారితో పోట్లాడేను కూడా-

ఆమె నవ్వుతూ "మా కంత ఆర్థిక స్థోమతలేదుబాబూ" అంది.

'ఆర్థిక స్థోమత' అంటే ఏమిటో ఆ రోజుల్లో నా కంతగా తెలీదు.

తరుచూ సెలవులకు యింటికి వస్తూ వుండేవాడ్ని. మాష్టార్ని కలుసుకుంటూ, అలివేలుతో మాట్లాడుతూ వుండేవాడ్ని.

చూస్తుండగానే సంవత్సరాలు గడిచి పోతున్నాయి.

నేను పెద్దవాడ్ని అవుతున్నాను. నా చుట్టూ పరిసరాల్ని, మనుషుల్ని-వాళ్ళ మనస్తత్వాల్నిగమనించగలుగుతున్నాను.

ఇంటర్మీడియట్ పరీక్షలు వ్రాసి, యింటికి వచ్చాను.

అలివేలును చూసి ఆశ్చర్యపోయాను. లంగా, జాకెట్లలోవుండే అలివేలు, వోణీలు వేసుకొని కన్పించేసరికి వెంటనే గుర్తుపట్టలేకపోయాను.

ఆమెలో ఎన్నడూలేని అందాలు నాకు వింతగా గోచరించాయి. అలివేలుతో నేను మాట్లాడాలని చేసే ప్రయత్నాలతో ఆమె సిగ్గుపడుతూ నాతో సరిగా మాట్లాడకుండానే యింట్లోకి పరిగెత్తేది. యిది వరకంత చనువుగా నాతో మసిలేదికాదు.

నా మనసు నాకు తెలియకుండానే ఆమెకోసం తపించేది...నా కాళ్ళు నాకు తెలియకుండానే ఆమెకోసం పరిగెత్తేవి. నా కళ్ళు నాకు తెలియకుండానే ఆమె కోసం గాలించేవి.

ఏమిటీ వింత ప్రవృత్తి - ప్రకృతి యింత అందంగా కన్పిస్తుందేం- !

శకుంతల మాష్టారిమీద; వినకూడని మాటలు జనం అంటూవుంటే నేను బాధ పడ్తూ వుండేవాడ్ని.

ఆమె 'చెడిపోయిన' ఆడదట - వాళ్ళంతా 'కుళ్ళి'పోయిన కులటట. ముకుందరావు తనపైఅధికార్లకు ఆమెను తార్చుతున్నాడట. చేసేది పంతులమ్మ వుద్యోగమైనా; ముకుందరావుకి మాత్రం ఉంపుడుగత్తె.

ఇంకా రకరకాల వ్యాఖ్యానాలువింటూ వుండేవాడ్ని-అలా అన్నవాళ్ళను చంపేయాలన్నంత కోపం వచ్చేది. బలవంతంగా కోపాన్ని దిగమింగుకునేవాడ్ని.

జనం అన్న మాటలన్నీ నిజం-నిజం కనుకే నేను ఏమీ చేయలేకపోతున్నాను.

శకుంతల మాష్టారు ఎందుకిలా దిగజారిపోయారు ? గౌరవంగా వుద్యోగం చేసుకొని బ్రతకొచ్చుగా- !

ఈ విషయమై నేను మాష్టార్ని ఒకసారి అడిగాను.




అప్పుడు నేను డిగ్రీ సెకండియర్ చదువుతున్నాను.

శకుంతల మాష్టారుకూడా వుద్యోగానికి రిజైన్ చేసి యింట్లోనే వుంటున్నారు.

ఆమె రాజీనామా చేయడానికి గలకారణం అనారోగ్యం.

మాష్టారు రిజైన్ చేశారని తెలిసి నేను చాలా బాధపడ్డాను నేను వెళ్ళేసరికి ఆమె మంచంలో పడుకొనున్నారు.

శుష్కించిపోయిన శరీరం-మంచానికతుక్కుపోయినట్లు... లోతుకుపోయిన కళ్ళు - లోకంలో విషాదాన్ని నింపుకొన్నట్లు...పాలిపోయిన వదనం - ఒకనాడు అందమైన ముఖారవిందమేనా ఆ రూపం?

నన్ను చూసి ఆమె లేచి కూర్చుంటూ 'ఎప్పుడొచ్చావ్?' చిరునవ్వుతో అన్నారు.

"పొద్దుటే".

"బాగా చదువుతున్నావా?"

"ఆఁ...మీరు ఇలా అయిపోవటం"

"తరిగే వయసు కదూ!"

"మీరు రిజైన్ చేశారని తెలిసింది"

"ఆరోగ్యం బాగోలేక"

"మరి మీకు ఆధారం"

ఆమె ఒక్కక్షణం మాట్లాడలేదు.

అనంతరం-

"నీకు తెలిసే అడుగుతున్నావా?"

నేను మౌనంగా వుండిపోయాను.

"ముకుందరావుగారు వున్నారుగా" ఆమె చిన్నగా అంది.

"వుండే-?"

"ఆయనే ఆధారం"

"మాష్టారూ మీరు ఏమీఅనుకోనంటే నేనో మాటడుగుతాను"

"అడుగు"

"ఇది నేను అడక్కూడదు ... కానీ నా చిన్నతనంనుంచే నన్ను వేధిస్తున్న ప్రశ్నలు...యీ వూరు జనం అనుకుంటున్న మాటల్నిబట్టి నేను అడగక తప్పడంలేదు"

ఒక్కనిమిషం మా మధ్య నిశ్శబ్దం!

"ముకుందరావుగారికి మీ రెందుకు లొంగిపోయారు?" ఎలా అడగాలో తెలీక అలా అడిగేశాను.

ఆమె చాలా సేపు మాట్లాడలేదు.

"చెప్పండి మాష్టారూ...గౌరవమైన వుద్యోగంచేస్తూ కూడా మీరు ముకుందరావుగారితో నీచంగా..."ఆగిపోయాను.

"ఆయనే లేకపోతే యీ వూరిజనం నన్ను బ్రతకనిచ్చేవారంటావా ?"

"అంటే ?"

"దిక్కూ మొక్కూ లేని ఆడదాన్ని యిరవయి ఏళ్ళ క్రితం యీ వూరు వచ్చాను... అంటే, అప్పట్లో వయసులో వున్న దాన్ని... నాభర్త చనిపోయే నాటికి ఏ ఆధారం లేనిదాన్ని... తెలిసున్న వాళ్ళ ద్వారా ముకుందరావుగార్ని ఆశ్రయించాను... నేను వుద్యోగమైతే చేయగలుగుతున్నానన్నమాటే గానీ... నన్నూ—నా వుద్యోగాన్ని ఎలా కాపాడుకోవాలి?... ప్రతీ వాడూ నన్నుచూసి వెకిలి నవ్వులు నవ్వుతూ నా వెనుకపడి అల్లరి చేస్తూ... అవకాశం దొరికితే నన్ను అనుభవించాలనుకునే మగ వాళ్ళు... ఒకనాడు ముకుందరావు గారు నన్ను లొంగదీసుకోవడానికి ప్రయత్నించారు... నేను ఒప్పుకోలేదు... ఆ తర్వాత ఆయన నా వుద్యోగం తీయించేస్తానని వార్నింగ్ యిచ్చారు... వుద్యోగం పోతే ఎలా బ్రతకాలి... ఈ పరిస్థితుల్లో నేనేం చేయాలి...?" ఆమె ఓ నిమిషం ఆగింది.

నేను వింటున్నాను.

"చివరికి ఆయనకు లొంగిపోక తప్పలేదు... ప్రసిడెంట్‌గారి వుంపుడు గత్తె అని తెలిసిన తర్వాత ఏ మగాడు నావేపు కన్నెత్తి చూసే ధైర్యం చేయలేకపోయాడు... లేనివాడి పెళ్ళానికి లేని విలువ వున్నవాడి వుంపుడు గత్తెకు విలువిచ్చే యీసమాజంలో నాలాంటి ఆడది యింతకంటే ఏం చేయగలదు—?"

నేను మాట్లాడలేక పోయాను.

"నేను యిలా దిగజారి పోవడం... యిలా చేయడం నాకోసం కాదు... నా సుఖం కోసం అంతకన్నా కాదు... అలివేలు కోసం... నాకూతురి భవిష్యత్తు కోసం... నేనిటూ సుఖపడకపోయినా అదన్నా భవిష్యత్తులో సుఖపడుతుందని నేను యిలా ముకుందరావు గారికి వుంపుడుగత్తెగా వుండిపోయాను".

ఆమెనింక ప్రశ్నించవలసిందంటూ ఏమీలేదు.

హృదయ భారంతో బయటకు వచ్చేశాను.

సెలవుల అనంతరం తిరిగి వెళ్ళిపోతుంటే అలివేలు నన్ను కలిసింది.

"వెళ్ళిపోతున్నావా" ఆమె అంది.

"ఆఁ... సెలవులయిపోయాయి"

"నీతో ఒకమాట చెప్పాలనుకుంటున్నాను"






"ఏమిటది?"

"అదే... ఎలా చెప్పాలో... నాకు తెలీడం లేదు"

నేను నవ్వి "చెప్పు ఫర్వాలేదు" అన్నాను.

"నన్ను... నన్ను... పెళ్ళిచేసుకోగలవా?"

ఆమెనోట నేను వూహించని మాట అది. ఆశ్చర్యంతో చూశాను.

ఆమె తలవంచుకొని, కాలి బొటన వేలుతో నేలమీద రాస్తోంది.

"అలివేలూ. నువ్వు యిలా..."

"సిగ్గు విడిచి అడిగాను... సమాధానం చెప్పలేవా?"

"సమాధానం యిప్పుడే చెప్పాలా?"

"ఆఁ...యిప్పుడే చెప్పాలి"

"మరో ఏడాది ఆగలేవా అలివేలూ!"

"దేనికి, పెళ్ళికా లేక నీ సమాధానానికా?"

"రెండిటికీను."

"అంత సమయం లేదు"

"మరో ఏడాదికి నువు నన్ను పెళ్ళి చేసుకోవడానికి ముందుకువచ్చినా అప్పుడు నేను అంగీకరించలేనేమో!"

ఆమె మాటలు నాకు అయోమయంగా వున్నాయి. "తొందరపడి నేను మాట యివ్వలేను... ఇచ్చినా నాకిప్పుడు విలువలేదు... నా చదువింకా పూర్తికా లేదు... చదువు పూర్తయితే ఏదో వుద్యోగం చూసుకొని నాకాళ్ళమీద నేను నిలబడాలి... ఆ తర్వాత నిన్ను పెళ్ళి చేసుకోవడం నాకేమాత్రం అభ్యంతరం లేదు"

ఆమె వెంటనే మాట్లాడలేదు.

నేనామె మొహంకేసి చూస్తుండిపోయాను.

ఆమె కళ్ళలో గిర్రున తిరుగుతున్నా యి కన్నీళ్ళు.

ఎందుకామె యింతలా బాధపడ్తోంది ఎందుకని పెళ్ళికంత తొందర పడుతోం దామె? ఎంత ఆలోచించినా ఆమె మాట ల్లో ఆంతర్యం నాకు అర్థమవడంలేదు.

ఆమెకి ఏటూ సమాధానం చెప్పలేక తిరిగి వచ్చేశాను.

తరచూ అలివేలు మాటలే గుర్తొస్తుం డేవి. మనసంతా బాధతో నిండిపోయేవి. ఎన్నాళ్ళనుంచో నా మనసులో అలివేలు మీదున్న ఆరాధన... పెళ్ళంటూ చేసు కుంటే ఆమెనే చేసుకోవాలనే నానిర్ణయం నేను బయట పడకముందే ఆమె ఎందుకు తొందరపడి పోయింది?

మరో ఏడాది గిర్రున తిరిగింది.

ఫైనలియర్ ఎగ్జామ్స్ రాసి యింటికి వచ్చేశాను. శకుంతల మాస్టారి ఆరో గ్యం మరింత క్షీణించిందట. ఆమెను ఆమెను చూడాలని వారింటికి వెళ్ళాను.

మంచం లోంచి లేవలేని పరిస్థితి– ఆస్థితిలో మాస్టార్ని చూస్తోంటే నా కెందుకో ఏడుపొచ్చేసింది.

చాలా సేపు ఆమెతో మాట్లాడి వెను దిరిగి పోయాను. అంత సేపు నేనా యింట్లో వున్నా అలివేలు కనిపించ లేదు. ఆమె గురించి మాస్టార్ని అడగాలనుకున్నా, ధైర్యం చాల్లేదు.

ఆ మర్నాడు– అటు మర్నాడు కూడా అలివేలు కోసం చూశాను.

ఆమె కన్పించలేదు

ధైర్యం చేసి మాస్టార్ని అడిగేశాను. "అలివేలు వూళ్లోలేదాండి?"

"వుంది"

"మరి కన్పించదేం?"

"నీవొచ్చేంతవరకూ యింట్లో నే వుంది. ఇంతలో ఎక్కడికెళ్ళిందోమరి"

నాల్గోరోజు చెరువు గట్టున ఎదురైంది అలివేలు.

నన్ను చూసి. తప్పించుకోవాలని చూసింది.

నేను దారికడ్డుగా నిలబడి పోయాను.

ఆమెలో ఎన్నో మార్పులు కనబడు తున్నాయ్. ఇదివరలో వోణీలు వేసు కున్న ఆమె యిప్పుడు చీరలు కడు తోంది. చీరలో ఆమె పెద్దదానిలా... హుందాగా... అందంగా వుంది.

"ఎందుకు నన్ను తప్పించుకొని తిరుగుతున్నావ్?" అడిగాను.

ఆమె మాట్లాడలేదు.

"నామీద కోపమా అలివేలూ?"

"నాకెవరి మీదా కోపంలేదు."

"అలా అని సర్ది చెప్పకు"

"దయచేసి దారికి అడ్డు తొలుగు. నాదారి కడ్డురాకు ఇంకెప్పుడూ నాతో మాట్లాడకు. అలివేలు అనేది అసలు లేద నుకో" ఆమె నన్ను తప్పించుకొని వడి వడిగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

విస్మయంగా నిలబడిపోయాను.

"ఏమిటీ అలివేలు ప్రవర్తన?"

ఆ తర్వాత అలివేలుతో చాలాసార్లు మాట్టాడడానికి ప్రయత్నించాను.

ఆమె పలికేది కాదు-కన్నెత్తిచూసేది కాదు- నేను చాలా బాధపడేవాడ్ని.

ఒకనాడు... నిద్రపట్టని రాత్రి... గుండెల్లో బాధ కొండంతలు కాగా... ఆ




చల్లని వెన్నెల్లో... ప్రశాంతతకోసం వెళ్ళి ఏటి వొడ్డున కూర్చున్నాను.

చల్లని గాలి... రొదచేస్తున్న ప్రవాహం... తెల్లని వెన్నెల... పొదలో పూసిన పూల పరిమళం... ఆ వాతావరణం ఎంతో హాయిగా వుంది.

సిగరెట్ వెలిగించాను.

నిముషాలు తరిగిపోతున్నాయ్.

మూడు సిగరెట్లు తగలబడిపోయాయ్.

ఎంత సమయం గడిచిపోయిందో నాకు తెలీదు.

నావెనుకగా పొదలమాటున చిన్నగా మాటలు విన్పిస్తుంటే అదిరిపడ్డాను.

పొదలలో అలికిడి...ఎవరోవున్నారు గొంతుని బట్టి ఆడ - మగ అనుకున్నాను... ఎవరై వుంటారు? ఈ అర్ధ-రాత్రిపూట... వూరి చివర ఏటిగట్టున, పొదల మాటుకి వచ్చే అవసరం ఏమొచ్చింది?

సిగరెట్ ఏట్లోకి విసిరేశాను. మెల్లిగా అటుకదిలి, పదిగజాల దూరం వెళ్ళాక ఎత్తుగా పెరిగిన పొదల మాటునవొత్తుగా వున్న గడ్డిమీద పెనవేసుకుపోతున్నాయి రెండు మానవాకారాలు.

నా నరనరాల్లో ప్రకంపనాలు...వేడి రక్తం వురుకుతోంది...అంత చల్లగాలిలోనూ నాకు చెమటలు పట్టేస్తున్నాయి.

ఎవరు వీళ్ళు-? పరికించిచూశాను.

నా గుండెలు పగిలిపోయాయ్.

వెన్నెల వెలుగులో నగ్నంగా అలివేలు...అదే స్థితిలో ముకుందరావు...

చూడలేకపోయాను. గిరిప్కాన వెనుదిరిగాను.

భరించలేకపోతున్నాను-యీ బాధను మోయలేకపోతున్నాను. యీవాస్తవాన్ని విశ్వశించలేకపోతున్నాను.

ఇలా ఎందుకు జరిగింది ?

అలివేలు యింత నీచానికి...ఛీ... తలుచుకుంటుంటే అసహ్యంగావుంది.

నాలో ఆవేశం - అలివేలును చంపేయాలన్నంత వుద్వేగం. నాలో నరకం- నరకయాతన అనుభవించాను.

రాత్రంతా నిద్రపట్టలేదు.

ఇంకా తెల్లవారకముందే ఇంట్లోంచి బయటకువచ్చి; వూరుమీదపడి పిచ్చికుక్కలా తిరిగాను.

కళ్లు మండుతున్నాయ్ - గుండెలు మండుతున్నాయ్ - శరీరం యావత్తూ దహించుకుపోతోంది.

ఆ సాయంత్రానికి అలివేలుని వంటరిగా పట్టుకోగలిగాను.

"రాత్రి నీవెక్కడకు వెళ్ళావ్?"

ఆమె కళ్ళలో భయం.

"ఎక్కడి కెళ్ళావ్ ?"

"నీ కెందుకు ?"

ఆమె చెంప పగిలిపోయింది.

కోపాన్ని కంట్రోల్ చేసుకోలేకపోతున్నాను.

"ఎందుకొట్టావ్?" ఆమె తీక్షణంగా అడిగింది.

"కొట్టడంకాదు నరుకుతాను - చంపుతాను"

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకు; అసలు నన్ను కొట్టే అధికారం నీ కెవరిచ్చారు?"

"అధికారంకాదు అవకాశం"

"ఏమిటది ?"

"రాత్రి ఏటిగట్టున నిన్ను చూశాను"

ఆమె మొహం పాలిపోయింది.

'నీ పాపం నాకంటబడింది"

ఆమె కూలబడిపోయింది. మోకాళ్ళ మధ్య తలొంచుకొని వెక్కి-వెక్కి ఏడ్వసాగింది.

* *

బాబి :– "మమ్మీ సప్తసముద్రాలు ఎక్కడున్నాయ్ ?" పరుగుపరుగున వచ్చి వంటింట్లో అమ్మని అడిగాడు

తల్లి ;– (చిరాగ్గా) వెధవ-అన్నీ పారేసుకోవడం, వెతుక్కోవడం, ఎక్కడుండే వస్తువు అక్కడే వుంచాలనిచెప్తే విన్నావూ ? ఇప్పుడు వెతుక్కోనిచావు, నాకు తెలిదు"




నా గుండె కరగలేదు. "ఎందుకేడుస్తున్నావ్? నేను చూశాననా-ఛీ. ఆనాడు నీవు పెళ్ళికి ఎందుకంత తొందరపడ్డావో నా కిప్పుడుఅర్థమైంది. కామం వొళ్ళంతా కాగి-కళ్ళుపొరలుకమ్మి - నీకోర్కెలు చల్లారడంకోసం నీ వింతగా దిగజారి పోతావనుకోలేదు..."

ఆమె ఏడుస్తూనే వుంది.

నాకు అసహ్యం అనిపించింది.

ఐదు నిమిషాలు తర్వాత ఆమె ఏడుపును దిగమింగుకుంటూ; "నన్నా స్థితిలో చూసి నీవు అపార్థం చేసుకోవడంలో తప్పులేదు. కానీ నేనెందుకిలా చేస్తున్నానో నీకు తెలిస్తే నీ విలా మాట్లాడి వుండవు."

"అంటే. నీవు చేస్తున్నది తప్పుకా దంటావా?"

"తప్పేకావచ్చు. ఆనాడు నిన్ను పెళ్ళిచేకోమని అడిగింది నా కోర్కెలు తీర్చుకోడానిక్కాదు..."

"మరెందుకు?"

"ముకుందరావు బారినుండి తప్పించుకోడానికి"

ఆమెవేపు అయోమయంగా చూశాను.

"అమ్మ రోగిష్టిదై మంచంలోపడ్డాక ముకుందరావు మా యింటివేపు రావడమే మానేశాడు. అతన్నుంచి ఎటువంటిసహాయం మాకుఅందడంలేదు. అమ్మ చాలా సార్లు ఆయన్నుంచి సహాయాన్ని అర్థించింది. ఆయన మౌనంగా వుండిపోయాడు. ఓనాడు ముకుందరావు నన్ను పిలిచి తన కోర్కెను నా ముందు బహి

గ్రహించేశాడు ... వణికిపోయాను ... అతన్నుంచి మాకు ఆర్థికంగా సహాయం అందాలంటే నేనతనికి కావాలట...నేను తిరస్కరిస్తే యీ వూళ్ళో మేం బ్రతకడమే కష్టమన్నాడు...యీవిషయం నేను అమ్మకు చెప్పలేదు. ఏంచేయాలో ఆలోచిస్తున్న సమయంలో గత ఏడాది నీవు యిక్కడకు వచ్చావు. నీవు నన్ను పెళ్ళి చేసుకుంటే ఎటువంటి సమస్య వుండదనుకున్నాను. అందుకే అప్పుడు నిన్ను అలా అడిగాను. నీవు మరో ఏడాది ఆగమన్నావు. మరి యీలోగా మాయిల్లు గడిచేదెలా ?...ఎటూ గతిలేక ముకుందరావుకోర్కెను కాదనలేకపోయాను..." ఆమె కళ్ళలో నీళ్లు బొట్లుబొట్లుగా-

ఆమెమీద నా మనసు జాలి — సానుభూతి.

"ముకుందరావు యిప్పుడు మా కుటుంబానికి ఆర్థికంగా నిలబడ్డాడంటే.. అది తనమీదున్న ప్రేమే అనుకుంటోంది అమ్మ ... కానీ నా సంగతి ఆమెకు తెలీదు ... తెలిసిననాడు అమ్మ యిక దక్కదు..."

అలివేలు వెనుక యింత విషాదం దాగివుందా—వూహించలేకపోతున్నాను.

"నేను యిలా దిగజారిపోవడం ... యిలా చేయడం నా కోసంకాదు... నా సుఖంకోసం అంతకన్నా కాదు. మా అమ్మ కోసం...మా అమ్మ బ్రతుకుకోసం... నేనంటూ సుఖపడకపోయినా యీ చివరి రోజులలోనైనా అమ్మ సుఖపడుతుందని నేను యిలా ముకుందరావుకి లొంగిపోయాను..."

మతిపోయినవాడిలా ఆమె వేపు చూస్తుండిపోయాను.

ఒకనాడు అవేమాటలు శకుంతల మాష్టారు అన్నారు.

నాలో మెలిపెడ్తున్న బాధ. గుండె బరువుతో నడుస్తున్నాను...ఎటో ఏమిటో.. ఎక్కడికో...

ఈ కథ ఎలా ముగించాలో నాకు తెలీడంలేదు.

*

---

"గడియారం పదమూడు గంటలు కొడితే దానిని ఏం టైమంటారు?

"రిపేర్ కిచ్చే టైమ్ అంటారు!"

---

Edited & Published by V. Leelavathy Raghavaiah at 1-8-519/11 Chikkadapalli,' Hyd-20. & Printed by P. Ramakrishna at Raghava Printers 1-8-4/1/1, Chikkadapalli, Hyderabad-20.





ఇదుగో ఇక్కడే
తలనొప్పులకు
ఒంటినొప్పులకు,
జలుబులకు
విమోచనం
AMRUTANJAN
PAIN BALM
AMRUTANJAN LTD.
14/15, Luz Church Road Madras-4

AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.
42/45, Luz Church Road,
Madras 600004.
90 ఏళ్లు ఆర్జించిన నమ్మకం అమృతాంజన్
అమృతాంజన్
ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి

